# ధన్యజీవి

( పెద్ద[illegible] )



ఉభయభాషా ప్రవీణ,

**సామవేదం జానకిరామశర్మ.**

ప్రధానాంధ్రోపాధ్యాయుఁడు,

సెయింట్ థెరీసా బాలికోన్నతపాఠశాల, ఏలూరు.

**నోరి రామశర్మ, బి.ఎ.**

(Language graduate)

ఆంధ్రోపాధ్యాయుఁడు, పురపాలకోన్నతపాఠశాల, ఏలూరు.




పబ్లిషర్సు:

**రామా అండ్ కో.,**

హెడ్ ఆఫీసు : ఏలూరు.

బ్రాంచెస్ :—గుంటూరు, రాజమండ్రి, భీమవరం, తెనాలి, విజయనగరం.



[వెల రు. 0-15-0.

# విజ్ఞప్తి

ప్రభుత్వమువారి నూతనవిద్యా ప్రణాళిక ననుసరించి 'ధన్యజీవి' అను నీ పెద్దకథను ఉపవాచకముగ ఉన్నత తరగతుల విద్యార్థులకొఱకు వ్రాసితిమి.

మమ్మీ యుద్యమమునకుఁ బ్రోత్సహించిన రామా అండ్ కో., (ఏలూరు) ప్రొప్రయిటరులు శ్రీ ఈదర వెంకయ్య పంతులుగారికి మా నమస్కారములు.

ఈ కథయందు సంఘమందలి కొన్ని లోపములును, వ్యక్తుల వివిధములగు మనఃప్రవృత్తులును వర్ణింపఁబడియున్నవి. ఇట్టి పుస్తకముల నీ తరగతులనుండియే విద్యార్థులు పఠించుట కలవాటుపడిన సాంఘికాభివృద్ధికిని, వారి భావ్యభివృద్ధికిని దోహదము కాగలదు. సహృదయులు మా ఈ ప్రయత్నమును బ్రోత్సహించి మాకుఁ జేయూత నొసంగుదురని నమ్ముచున్నాము.

ఏలూరు,
1—11—49.

-రచయితలు.

గళవళ పెట్టుచుండెను. మొదటినుండియు నొకసారి జాబును జదివి తిరిగి దానిని యథాస్థానమున నుంచెను. మంచముపై బరుండి దీర్ఘాలోచనకుఁ గడంగెను. ఆలేఖవలనఁ దననాథునకుఁ దనకుటుంబముపై గోపమువచ్చినదనుట నామె సిరమొనర్చుకొనెను. భర్తకు వచ్చినకోపము నామె యుపశమింపఁజేయుట కసమర్థురాలాయెను. తాను గారణముగ భర్తకుఁ గోపమురాలేదను నూహ యొకింత యామెమనసునకు శాంతిఁ గలిగించెను. ఉమాపతి యల్లునకుఁ బదివేలరూప్యములు వివాహసమయమునఁ గట్నమొసంగెదనని వాగ్దానము చేసెను. నాఁటినుండియు నుమాపతి ప్రతివత్సర మల్లునకీయదలంచిన సొమ్మిచ్చుటకుఁ బ్రయత్నము చేయుచునే యుండెను. అనుకొనిన యడ్డంకు లనేకములువచ్చి యాకార్యమాయనను జేయనిచ్చినవి కావు.

పద్మిని కాపురమున కేగి మూఁడేండ్లైనది. తొలు తొలుత నత్తవారింట మూఁడునెలలు మాత్రముండెను. ఒకసారి సంక్రాంతిపండుగకు నుమాపతి కొమార్తెతో నల్లునాహ్వానించెను. అతఁడు భార్యనుబంపి తానేగుటమానెను. అప్పటినుండియు నాతఁడు భార్యను దిరిగి తీసికొనివచ్చుటకాని, తా నటకేగుటకాని చేయలేదు. అల్లుని యాగ్రహమునకు నుమాపతియు, రాధమ్మయు మిగుల భయపడిరి. ప్రారంభమున

నల్లునకు తమపైఁ గోపమువచ్చుటకుఁ గారణ మూహింపలేక పోయిరి. పద్మిని పుట్టినింటికి వచ్చి సంవత్సరమాయెను. అపు డుమాపతియల్లునకు భార్యనుదీసికొని వెళ్లుమని జాబు వ్రాసెను. దాని కాతఁడు పెండ్లినాఁటి కట్నమునుగూర్చి వ్రాయుచు భార్యను బదివేలతోఁగూడ బంపవలసినదేయని నిష్కర్షగఁ దెలియఁజేసెను.

ఉమాపతి సంపన్న గృహస్థు. వసంతవాడలో నాయ నకు మూఁడువందల యెకరముల మాగాని భూమియు, వంద యెకరముల మెట్టపొలమును గలదు. ఇందు చాలభాగము ప్రభుత్వమునకు శిస్తు చెల్లించనవసరములేని ఇనాము భూమి. ఇదిగాక కోనసీమలో సుమారు నలుబది యెకరములుగలదు. ఉమాపతికి తండ్రి బలవంతముగ నభ్యసింపఁజేసిన యాంగ్ల విద్య కొంతయును, దానై కోరినేర్చుకొనిన సంస్కృతమును వచ్చిన విద్యలు.

ఉమాపతికి సత్యమూర్తియను సోదరుఁడు కల్గఁడు. ఆతఁడును నన్నతో సమానముగఁ బితార్జితమును వాటా పంచుకొనెను. అన్నదమ్ములు విడిపోయిన కొంతకాలముననే సత్యమూర్తి చెడు సహవాసములు జేయ మొదలుపెట్టెను. మద్యపానాది దురభ్యాసముల నాతఁడు లెస్సగ నలవాటు చేసి కొనెను. దురదృష్టవశముచే నాతని యాస్తియంతయు గర్పూ రమువలె హారించెను. సోదరునియందలి ప్రేమచే నుమాపతి

యాతని భోజనాదికమునకు సరిపడునంత భూమి నుచితముగ నొసంగెను. దానివలననే యాతఁడు దనసంసారమును బోషించుకొనుచునుండెను.

అప్పటికి ఐరోపామహాసంగ్రామము ముగిసినకొన్ని వత్సరములయ్యెను. యుద్ధపుదినములలో బ్రతివస్తువునకును ధర హెచ్చెను. ఉమాపతికి భూములపై వచ్చునాదాయము యిబ్బడి యయ్యెను. ఖర్చుమూఁడింత లయ్యెను. ఆ హెచ్చు ధరలలోననే యాతఁడేలూరునఁగల యొకన్యాయవాది పుత్రునకు పద్మిని నిచ్చి మహావైభవముగఁ బెండ్లిచేసెను. పెండ్లికేలూరంతయు వసంతవాడవచ్చెను. ఆ వచ్చినవారిలోఁబని లేక దిరుగువారు మొదలు జిల్లాయధికారులవరకును గలరు. ఉమాపతి పెండ్లివారిలో నందఱకును బ్రత్యేకముగ శ్రద్ధ వహించి యే లోటును రాకుండఁగ నదుపాయములొనర్చెను. ఎల్లరును బెండ్లి మహావైభముగఁజరిగినదని వేనోళ్ళఁబొగడిరి. అల్లుఁడగు మోహనునితో సత్యమూర్తి మిగుల స్నేహముగ మెలఁగెను. పెండ్లిదినములలో వారిరువురు స్నేహితులైరి.

వివాహమైన కొద్దిసంవత్సరములకే పద్మిని యత్తవారింటికంపఁబడెను. ఆవల మూఁడు నెలలకేతిరిగిపండుగకు వసంతవాడ వచ్చెను. తిరిగి యామె ఏలూరుపోలేదు.

రాబడి హెచ్చుగ నున్నదినములలో నుమాపతి యల్లుని కట్నమును గూర్చి యోజింపలేదు. యుద్ధము ముగియు ననఁగా

నాతఁడు వసంతవాడలో హెచ్చుధరకు మాగానిభూమి నలు
బది యెకరములను ఋణముచేసి విలిచెను. కోనసీమలోనాతని
కున్నభూమి నెమ్మదిగ నమ్మి యాఋణమును దీర్చవలెనని
యాతఁడు తలఁచెను. దైవము వేఱువిధముగ నూహించెను.
హెచ్చుధర కాతఁడు కొనుటయే జరిగినదిగాని యమ్ముట
జరుగలేదు. యుద్ధము ముగియుట తోడనే క్రమక్రమముగ
నన్నివస్తువులకును ధరలుతగ్గిపోయెను. పొలముల ధరలుసగము
నకు సగముతగ్గెను. కొందుమని ధైర్యముచేసి ముందునకు
వచ్చువారు లేకుండిరి. ఉమాపతి యూహించిన విధముగ
జరుగలేదు. తెచ్చినఋణము హెచ్చు వడ్డీలపైనుండెను. అది
యు నాయూరనే యొకరివద్ద తనకు గావలసిన నెనుబదివేలును
పత్రమువ్రాసి తెచ్చెను. దినదినమును వా రాతనిని తొందర
పెట్టుచుండిరి. పెద్దకుమారుఁడు పట్నమునఁ జదువుచుండెను.
నెలనెలనాతనికి నూటయేబది రూప్యములు పంపవలసివచ్చు
చుండెను. ఇంటనన్నసత్రము సాగుచునే యుండెను.
నదుమనదుమ నల్లునికడనుండి పదివేలరూకలకొక నిష్ఠు
రపులేఖ వచ్చుచునే యుండెను. నాటిరాత్రి పద్మిని
మనస్సున కావేదనఁ గలిగించిన లేఖ యాతఁడు వ్రాసిన
తుదిలేఖ. అందాతఁడు పదివేల రూప్యముల నొసంగ
నిచో, అందును మూఁడుమాసములలో నీయనిచో, బద్మినిని
వీడుటకు సిద్ధముగనుంటినని స్పష్టపఱచెను. ఇది

యుమాపతికిని భార్యకును మిగుల బాధకలిగించెను. రాధమ్మ పగలంతయు నేవిధముగనైన నల్లునియలుక దీర్పుఁడని భర్తను వేడెను. ఉమాపతి ఏ ధరకైనను భూములను దెగనమ్మి యల్లునియొక్కయు, పత్రముపై నప్పిచ్చిన గ్రామములోని నూరయ్యగారి యొక్కయు బాకీని తీర్చఁదలఁచితిననియు, నొక్కరును గొనువారులేరనియుఁ దెల్పియుఁ జెప్పెను. భర్తకడనుండవలసిన కొమార్తె పుట్టినింట నున్నందుల కుమాపతి లోలోనఁ గుములుచుండెను. రాధమ్మ మగని యావేదనను గ్రహించియు, నిరుగు పొరుగువారును, బంధువులును నాడుమాటలను భరింపలేకయు నాతనిఁదొందర పెట్టసాగెను.

అల్లుని కట్నపు రూకలకై తామాందోళనఁ జెందుచున్నట్లు పుత్రిక యెఱింగిన వ్యధపడునని వారికిఁ దెలియును. తత్కారణముగ యథేచ్ఛముగఁ గర్తవ్యమును జర్చించుకొనుటకైనను వారి కవకాశములేకుండెను. ఆనాఁడల్లుడు వ్రాసిన యుత్తరమును గూర్చి యుమాపతి భార్యకుఁ దెల్పెను. మంచి దినములు వచ్చువఱకు నూరకుండుటఁదప్ప తానేమియుఁ జేయఁజాలనని యాతఁడు చెప్పలేక చెప్పలేక భార్యతో ననెను. ఆ మాటకు రాధమ్మ క్రుంగిపోయి కొమార్తె కాపురము కుదుటబడవేయుట కేదైన నుపాయాంతర మూహింపుడని వేడుకొనెను. ఉమాపతి దీర్ఘాలోచన మొనర్చి భార్యతోఁ

దనకు భగవంతుఁడేదైన దారిఁజూపించినఁదప్ప నప్పటి స్థితిలో యల్లున కీయవలసిన పదివేలుకాని, సూరయ్యగారి యెనుబది వేలుకాని తా నీయఁజాలనని పలికెను. తానొనర్చిన యవివేకపుఁ గార్యమునకై యే పాపమెఱుఁగని తనూజ బలి కావలసి వచ్చుచున్నందుల కాతఁడు మిగుల విచారమును వెలిపుచ్చెను. తుదకు రాధమ్మ మగనితో నల్లునిపేర నాతని కీయవలసిన ధనమునకై యొక కొన్ని దినము లోపికపట్టవలసినదిగఁ గోరుచు నుత్తరము వ్రాయుఁడని పలికెను. ఉమాపతి తా నావర కనేకయుత్తరములట్టివి వ్రాసియుంటిననియు, వాని వలన నాతని మనసునఁ గ్రోధము పెఱుగుటయేకాని ప్రయోజన ముండదనియువచించెను. ఒకింతసేపాగి యాతఁడుభార్యతో నేలూరు తా నేగి యల్లునిఁ గలిసికొని పరిస్థితులఁ జెప్పి మఱి కొన్నిమాసములం కాలవ్యవధిని గోరి వత్తునని వచించెను. రాధమ్మ పెనిమిటి మాటల కంగీకారమును దెల్పెను. ఏమైనను ఆ పగలంతయు భార్యాభర్తలు మిగుల విచారముతో డనే గడపిరి.

పద్మిని పగలంతయుఁ దలిదండ్రులు తనభర్త వ్రాసిన లేఖపైఁ బొందుచున్న యావేదనను గ్రహించెను. తండ్రికడ నుండి నాథుఁడు వ్రాసిన జాబును దీసికొనిచూచు ధైర్యమును వహింపఁజాలకపోయెను. అందలి విషయములు దన కెఱింగింపు డని జనకుని నడుగుటకుఁ గూడ వెనుకాడెను. రాధమ్మ పుత్రిక

కడ నల్లుడు వ్రాసిన జాబునుగూర్చిన ప్రసక్తియే తీసికొని
రాలేదు. తన కా లేఖయందలి విషయములు తెలియనీయ
రాదనియే తలిదండ్రు లూహించిరను నంశమును బద్మిని
గ్రహించెను. తలిదండ్రులు లేఖయందలి యంశమును దాచు
చున్నందుల కామె మనస్సు పరిపరివిధములఁ బోయెను. పగ
లంతయుఁ బిచ్చి యెత్తినదానివలెఁ గొంత సేపింటఁ దిరుగాడెను.
ఒకింత సేపు ఇంటికి వెనుకవైపుననున్న గొడ్లసావడిలోని కేగి
యట నుండెను. మఱికొంత కాల మాంధ్రగ్రంథముల పుటలు
తిరుగవైచెను. చిన్నతమ్మునితోఁ గొన్నిగంటలు గడపెను.
పని చేయుచున్నను మనస్సుమాత్రము లేఖలోని విషయము
లేవియైయుండునాయని యూహించుచునే యుండెను. మనస్సు
నకు వ్యధకలిగినపుడు కాలము యథారీతిని సాగదు. పవళ్లును
రాత్రులును దీర్ఘములై తోచును. నిత్యమును నిమేషముల
వలెఁ గడచు గంటలు దినములట్లు తోచును. దినములు
మాసములవలెను, మాసములు వత్సరములవలెను నగును.
అంతయేల సర్వమును సుదీర్ఘమై కాన్పించును. అది ప్రకృతి
లోనున్న సహజగుణము. బాధనందుచున్న వ్యక్తి సుఖమయ
జీవితమును గడపుచున్న వారిని గాంచి యాశ్చర్యమందును.
తాను మాత్రమట్టి దైన్యస్థితియందుండుటకు హేతు వేమై
యుండునాయని తర్కించును. తన వేదనలోఁ బాలుపంచు
కొనువారికై వెదకును. ఇట్టిస్థితిని పద్మిని వహించుచుండెను.

ఎట్టకేల కారాత్రి యెల్లరను నిదురించుచున్న సమయమున భర్త వ్రాసిన జాబును జూచి పిదపఁదనకర్తవ్యమునునిర్ణయించు కొనఁదలంచెను. రాత్రికై నిరీక్షించి నిరీక్షించి తలిదండ్రులు నిద్రించుచున్న సమయమున పఱపు క్రింద నున్న లేఖను దీసి చదివెను. తనపైనే నేరమును భర్తమోపకుండుటకు సంతసమును పదివేల రూప్యములొసంగనిచో దన్నువీడుదునని వ్రాయుటచే విచారమును నొక్కసారిగనామెనుగలఁతపెట్టెను.

తండ్రికడ పదివేలరూపాయలను భర్తదీసికొనదలంచి నందులకు పద్మిని బాధపడలేదు. రూకలొసంగనిచో నేపాపమెఱుఁగని తన్నేల ఆతఁడు పరిత్యజించవలెను? బాల్యమునఁ దానుజదివిన సంస్కృతగ్రంథములలో భార్యాభర్తలసంబంధము బహుజన్మలపుణ్యఫలముచే గూర్పబడినదియును, జన్మ జన్మాంతరములవఱకు నెడతెగనిదై యుండునదియును నని జెప్పబడినదికదా ! యిప్పుడేల అదియంత తేలికగ బరిత్యజింపఁ బడవలెను? ఒకింత తప్పునకింత కఠిన దండనమొసఁగుటయేమంత యుక్తమైనపని? ఇదికూడదని ఎవరును సలహానిచ్చువారు లేరా! అందఱకు విదియే యుక్తమనితోచెనేమో! తనమనమున నున్నవేదన యున్నగదా ఇతరులు దీనికై యింతగ నాలోచించునది. మూఁడుసంవత్సరములనుండియుఁదానైన నొ లేఖను భర్తకు వ్రాయలేదేమి ? వ్రాయకపోవుటయు ఆయనను క్షమాభిక్ష వేడకపోవుటయు దప్పగునేమో! ఆలేఖమైన

నాయనమాత్రము తనకేల వ్రాయరాదు. ఇట్లొక టొకటిగ నానిశీథమున భావనాపరంపరలుప్పతిల్లి పద్మిని హృదయమును సంక్షుభితతరంగములు పారావారమునువలెఁగలఁతపెట్టెను.

గోడగడియారము మొకగంటకొట్టి యూరకుండెను. పద్మిని మెల్లగఁ దనపెట్టిలోనున్న కలమును కాగితమును దీసెను. ధైర్యము చేసి నాథునకు లేఖవ్రాయవలయుననియే సంకల్పించెను. కాగితమును జేతఁబట్టుకొని తిరిగి యోచనకుఁ గడంగెను. భర్తకడ నామెయున్నది. మూఁడు మాసములు మాత్రమే. ఆ మూఁడు మాసములలో నామె యెన్నఁడును దానై భర్తతో మాటలాడి యెఱుంగదు. మాటలాడ గూడదని యామె తలంపుగాదు. భారతీయ సంస్కృతిని దాచిపెట్టిన గీర్వాణ, భాషాపరిచయము భర్త నామెకు దేవునిగ గన్పింపఁజేసెను. అత్తమామల సేవయు భర్తృచరణసేవయు నామె జీవితమున ననుష్ఠింప వలసిన యుత్తమ కార్యములుగ నామె యెంచుకొనెను. కనుకనే యామె యత్తింట నున్నదినములలోఁ బల్లెత్తి భర్త నొకసారియైనఁ బలుకరించు సాహసమును జేయ లేదు. కొలది దినములు మాత్రమే యుండుటచే నామె యత్త వారింట నన్యగృహమున మెలఁగినట్లేయుండెను. అత్తమామల తోడను, ఆడుబిడ్డలతోడను మఱదులతోడను, దుదకు భర్తతోడను గలుగవలసినంత చనవు గలుగలేదు.

ఆ యిల్లు తనదేయనుట నామె యెఱింగియున్నను మనసు మాత్ర మాయూహకుఁ దగినట్లుగ నుండజాలక పోయెను. పతి యింటికేగిన క్రొత్తదినములలోఁ బడుచులకు సర్వమును క్రొత్తగనే యుండును. పుట్టినింటి యాచారములకును, నచ్చటి వానికిని భేదమేర్పడును. తానై ఏ కార్యముననుఁ జోక్యము కల్పించుకొనుట కవకాశముండదు. ప్రయత్నించి, సాహస మలవడఁ జేసికొని యేపనియందైనను వ్రేలుపెట్టఁదలంచిన నత్తయో, మామయో యడ్డుపెట్టును! భార్యాకాపురమునకు వచ్చిన తొలిదినములలో దనకుఁగల ప్రేమను వెల్లడించుటకు భర్తయుఁ గొంకును. తలిదండ్రులఁజూచియో, లేక నూతనముగఁ దనకుఁ గలుగుచున్న యనుభూతి నుపలక్షించియో, యాతఁడును బ్రియురాలిపైఁ దనకుగల ప్రేమాధిక్యతను బహిరంగము జేయుటకు సాహసింపఁడు! ఈ స్థితియే పద్మినీ మోహనుల ప్రథమసమావేశపుదినములలో నేర్పడెను. ఐనచో దానెట్లు భర్తకు లేఖ వ్రాయఁగలదు! వ్రాయకయున్నచో దన పుట్టినింటివారిపై నాయనకు గోపమధికమగునేమో! ఒకవేళ సాహసముచేసి లేఖవ్రాయుట చేతనే మోహనుడు తనను వేఱుగ నర్థముచేసికొనునేమో! కాగితమును గలమును జేత బట్టుకొనిన పిమ్మట నిట్లొకటొకటిగ నూహలు జనింపసాగెను. తుదకామె తనపై భర్తకు కోపములేని యపుడు జాబు వ్రాసి నంతమాత్రమున కోపమువహింపఁ జాలడని నిర్ణయము చేసి.

కొనెను. తా న త్తయింటనున్న దినములలో కాహానున్ని పక్క తిపొమ్ముగనున్నటులే పద్మిని యూహించెను. తనతోనొక్క మాటైన దనయ త్తమామ లీయవలసిన కట్నపు సొమ్మును గూర్చి మాటలాడలేదు. విశేషించి యొకటిరెండు సారులు తనతండ్రిని గురించి యు త్తమభావమునే మాటల సందర్భమున వెల్లడిచేసెను. ఐననిక లేఖ వ్రాయుటకేల సందేహింపవలెనని మెఱపువలె నొకభావము వచ్చి యామె నాశ్రయించెను. అంతలోననే యొకింత కాలమూరకుండి పరిస్థితులనుగమనించుట యుత్తమమని తద్వ్యతిరి క్తభావమొకటి పొడుచుకొనివచ్చెను అప్పటికి రెండుగంటలు దాటినది. లేఖ వ్రాయదలచిన వెంటనే వ్రాసిముగింపవలెను. లేదా! యాదినమునకు వ్రాయుట మానవలెను. గృహకృత్యములు నిర్వహించుటకు రాధమ్మ నిత్యమును దెల్లవారు జాముననే లేచునలవాటు గలది. ఆమె మేల్కొనిన పక్షమున, బద్మిని నిశయంతయు మేల్కొని యుండుటయు నాందోళన మందుటయు, దెలిసికొనును. ఇప్పటి వరకును తలిదండ్రులకు బద్మిని మనస్సులో నేమున్నదియో తెలియదు. అత్తయింటికేగ కుంటినిగదా యనిపద్మిని విచారించుట లేదని వారు తలంచుచుండిరి. ఇప్పుడామె మేల్కొని యుండుటను దల్లి చూచినచో వారిమనసులకు వేదనకల్గును. కాన లేఖ వ్రాయదలచిన వెంటనే వ్రాయ ప్రారంభింప వలెను. లేదానాటికా ప్రయత్నము మానవలెను. ఎన్ని

ప్రతికూల, అనుకూలభావములు మనస్సులో సంకులసమరము సాగించుచున్నను బద్మిని లేఖ వ్రాయుటకే నిర్ణయము చేసెను. ప్రథమమున లేఖ నెట్లు ప్రారంభింపవలయును ? ఏమని సంబోధింపవలయును ! ఏ యే విషయములు లేఖలో స్పష్టము చేయవలెను ? ఇవి ముందుగ నిర్ణయ మొనర్చుకొనుట యుత్తమమని యామెకుఁ దోచెను. ముందుగఁ గొన్ని సంబోధనలు భర్తనుగూర్చి వ్రాసెను. అందొక్కటియు నామె మనస్సునకు నచ్చలేదు. వాని నెల్లఁ బూర్వపక్షము చేసెను. వేఱొక కొన్ని వ్రాసెను. వానిని గొట్టివేసెను. మఱికొన్ని లిఖంచెను. అవియును నాగలేదు. ఇట్లు పలుమారు లామె వ్రాయుటలు, కొట్టివేయుటలు జరిగెను. తుదకొక సంబోధన నామె కొట్టివేయక యుంచెను. ఆపిమ్మట నప్రమత్తతతోఁ దాను వ్రాయఁ దలఁచుకొనిన యంశములనొకటొకటిగ వ్రాయనారంభించెను. నడుమనడుమనందును కొట్టివేతలు వచ్చుచునేయుండెను. ఒక్కొక్క వాక్యము వ్రాసి యొకింతసేపు దానిని జదువుటతో నామె కాలహారణ మొనర్చుచుండెను. వ్రాసిన వాక్యమెల్ల నామె మన్నస్సునకు వచ్చిననే వేఱొకవాక్యము ప్రారంభించుచుండెను. పుట్టినింటినుండి తనకడకే తెంతునని వ్రాయుటకామె మనస్సు సంకోచించెను. ఆ భావమును వ్యక్తపఱచినచో నాతఁ డేమనుకొనునో ! పుట్టినయింటఁ దాను బాధపడుచున్నట్లాతఁడు భావించునేమో! తా నా విషయమును వ్రాయకున్న

నీకు లేఖ వ్రాసి ప్రయోజనమేమి ? ఈ యంశమును వ్రాయ కున్నమాత్రమున నాతఁడు తా నత్తింటికి కేతెంచుటకుఁ దొందరపడుచున్నట్లు లేఖవలన నెఱుఁగలేఁడా ? ఇది యామె కొక పరీక్షాంశమయ్యెను. ఎట్టకేల కెట్లో యా విషయమును గూడ వ్రాసెను. తాను దలంచినవిధమున లేఖ వ్రాయుట పూర్తియయ్యెను. చాలసారులు లేఖను జదువుకొనెను. చదివి నపుడెల్ల భాషయో భావమో దిద్దబడుచునే యుండెను. తిరిగి గడియారము మూఁడుగంటలు కొట్టెను. అపుడామె తుదిసారిగ లేఖ నిట్లు చదువుకొనెను.

“ప్రాణేశ్వరా !

హృత్పూర్వకప్రణామములు.

ఈ లేఖను జూచుటతోడనే తామొక యపూర్వాను భూతినందుదురని నేనెఱుంగుదును. నేను దమకడనున్న స్వల్ప కాలములోనే తమ యున్నతగుణగణముల నూహించుకొను భాగ్యమునకు నోచుకొంటిని. నే నింటకేతెంచినప్పటినుండియు లేఖామూలమునఁ దమ క్షేమాదికము నెప్పటికప్పుడు తెలిసి కొన దలఁచుచునేయుంటిని. కాని నాకు ధైర్యము చాలలేదు. నిరంతరవిద్యాభ్యాసంగమున నుండు మీ మనస్సును అనుభవ ములేని నా వ్రాతలవై పునకుఁ ద్రిప్పుటకూడ నుచితము కాదేమో యనియు నిన్నినాళ్లు సంశయించితిని. ఎట్టకేలకు నా మనో

భావములు మీకుఁ దెలుపుటకు భగవంతుఁడు సాహస మొసంగినాఁడు. అన్యథా భావింపక ప్రేమపూరిత భావముతో నీ లేఖను జదువ వేడుచున్నాను.

తాము నిన్న మా నాయనగారికి వ్రాసిన లేఖ నేఁడిటకుఁ జేరినది. అందలి సంగతులు నాకవగతమైనవి. నాయనగారు మీ కీయ నొడంబడిన కట్నపు రూకల నొసంగుటకై విశ్వ ప్రయత్నము చేయుచున్నారు. కాలము తోడు రాకుండుటచేఁ గాలహరణము జరుగుచున్నది. అనతికాలముననే వారు తమ వాగ్దానమును జెల్లించుకొనఁగలరు. నాపైనను మా కుటుంబముపైనను దమరు దయఁజూపి కొంత వ్యవధి నీయ వేడుచున్నాను. నాయనగారిప్పుడు చాల చిక్కులలోనున్నారు. ఋణము లొసంగినవారు ఒత్తిడి చేయుచున్నారు. మా తమ్మునకు నెలకు నూటయేబది రూపాయలు ఖర్చులకై పంపవలసి వచ్చుచున్నది. మాకున్న భూములు విక్రయించి ఋణములను దీర్పఁజూచుచున్నారు. ఒక్కరును భూమి కొందుమని యనుట లేదు. ఈ నడుమ గాలివానకు గొడ్లసావడి కూలి నాలుగు జతలబండియెడ్లును, రెండు ఆవులును మరణించినవి. పశువులు నష్టమగుట నాయనగారికి చాల బాధ గలిగించినది. మా తమ్ముఁడీ నడుమ సన్నిపాత జ్వరముచేఁ గొన్ని నెలలు బాధపడినాఁడు. భగవత్కృపవలన నిప్పుడిప్పుడే కోలుకొనుచున్నాఁడు. రైతులకు నాయనగారు పెట్టిన పెట్టుబడి

ధనము ఈ సంవత్సరముపంట తక్కువ పండుటచే నీయలే మనుచున్నారు. మెఱకచేనున వేసిన బత్తాయితోటలో చెట్లు సగమునకు సగము గాలివానకుఁ గూలినవి. ఇట్లు అనేకవిధము లుగా నీ సంవత్సరము మాకు చాలనష్టము గలిగించుచున్నది. రావలసిన బాకీలు రైతులనుండి వచ్చుటలేదు. ఈయవలసిన వారి యొత్తిడి దినదినమును నెక్కువ యగుచున్నది. ఈ పరి స్థితులలో నాయనగారొకింత ధైర్యమును వీడినట్లు కనిపించు చున్నారు. వారియందు పూర్వమున్న యుత్సాహముగాని, యారోగ్యముగాని కనుపట్టుటలేదు. కాన నాయందును మా కుటుంబమునందును కరుణఁజూపి యీ కష్టసమయములో నాయనగారి యండనిలిచి తగు సలహానొసంగి మమ్ముద్ధరింప వేడుచున్నాను. మీ రుద్యోగమునకై ప్రయతించుచున్నటుల విని యానందించితిని. అనతికాలముననే మీకాపదవిలభించిన దని వినుట కుత్సాహముతో నున్నాను. మామగారును, అత్తగారును క్షేమముగ నున్నారని తలఁతును. మీ సోదరి వసుంధరయు తమ్ముఁడు కృష్ణుఁడును పాఠశాలకు వెళ్లుచున్నా రని తలఁచుచున్నాను. ఇప్పటికే లేఖ దీర్ఘమైనది, నాయనగారు తమ కీయవలసిన పైకమునుద్వరలో నిచ్చునట్లు నాశక్తి వంచన లేక ప్రయత్నము జేయుదును. తా మొకపరి యిటకే తెంచి నాయనగారికి ధైర్యముచెప్పి వ్యవహారములు సర్దుబాటగు నట్లొనర్పు సాయముజేయు డని మఱియొకసారి వినయముతోఁ.

ప్రార్థించుచున్నాను. సాహసించి తమకీలేఖ వ్రాసినందులకు మన్నింపుడు. మీదర్శనమునకై ఎదురు చూచుచుందును.

ఇట్లు, మీయర్ధాంగి
ప ద్మి ని.

పద్మిని లేఖను జదువుకొని భద్రముగ మడచి పఱుపు క్రింద దాచెను. గోడగడియారము నాల్గు గంటలు కొట్టెను. పద్మిని తనమంచముకడకేగి పరుండి దుప్పటిముసుగుపెట్టెను.

రాధమ్మగారు నిద్రలేచుటయు, పద్మిని పరుండుటయు నొకింత భేదముగ జరిగెను. కాల్యములను దీర్చుకొని రాధమ్మ మజ్జిగఁజిలుకుట కారంభించెను. రాత్రియంతయు సరిగ నిద్దుర పట్టక యుమాపతియు నెప్పటికన్న ముందుగనే లేచి పొలము నకుఁ బోయెను.

చూచుచుండగనే సహస్రకిరణుఁడు తనరాగమును జగ మెల్లెడ వ్యాపింపఁజేయసాగెను. పాలేరువచ్చి యుమాపతి యింటగేదెలను, ఆవులను బాలుపితికి వేర్వేరుగ నింటిలో రాధమ్మగారిని కేకవైచి పాలనొసంగెను. పశువుల కొట్టమును బాగుచేసి వానినన్నింటిని నీవలఁగట్టి జనపకట్టె లెండుగడ్డియు వైచిరి. లేగదూడలు తమతల్లులకడఁ బాలు ద్రావి వీథు లలో గంతులు వేయసాగెను. వీథియరుగులపై గూరుచుండి రైతులు ముఖప్రక్షాళనము జేయసాగిరి. నడుమ నడుమ నారు

లోకవృత్తముల నేకరువు పెట్టుచుండిరి. ఉమాపతి యింటికి పసిబిల్లల కావుపాలకై నలుగురైదుగురు వచ్చి చెంబులు నిండుగఁ బోయించుకొని పోయిరి. తెల్లవారు జామున నే తోటకు పోయినపాలేరు వంకాయలు, పచ్చిమిరపకాయలును గోసి తెచ్చి యింటిలో నొసంగెను.

కొంచెము ప్రొద్దెక్కెను. రాధమ్మవచ్చి కుమార్తెను నిద్దుర లేపెను. పద్మినిక ండ్లెబ్బారి యుండెను. వెంటనేయామె ముఖప్రక్షాళన మాచరించి కాలకృత్యములు నిర్వర్తించుకొని తమ్ములను లేపి మొగములు కడిగించి చల్దియన్నములు పెట్టుటకై వంటయింటఁ బ్రవేశించెను.

---

## ౨

పూర్వమొకప్పుడు రెడ్డిరాజులుపరిపాలనఁజేసిన హేలాపురమునకు నేఁడేలూరని నామ మేర్పడెను. పూర్వపురాజుల యశస్సును జాటుచు నటనట నేఁటికిని శిథిల చిహ్నములు గానబడుచుండును. ఏలూరు చాళుక్యులు పరిపాలనఁజేసిన వేఁగిక్షేత్రమున కనతిదూరమున నున్నది. ఒకానొక కాలమున నాంధ్రుల యశోవల్లరిని దిగంతములలోఁ బ్రాకించిన పేరు ప్రఖ్యాతు లీ ప్రదేశముకూడ బంచుకొన్నది.

ఏలూరున పవరుపేట నూతనముగ నేర్పాటు కావింపఁ
బడినది. ఆ పేటలో లాయర్లు, ఉద్యోగస్థులు మొదలగువా
రనేకులు నవీనపద్ధతిని గృహనిర్మాణమొనర్చుకొని యున్నారు.
పురపాలకసంఘమువారిచే నట నొక 'పార్కు' నిర్మింపఁబడి
యున్నది. దాని కనతిదూరముననే యుమాపతి వియ్యాలవారి
గృహముకలదు. ఉమాపతి వియ్యంకుని పేరు సుందరరావుగారు.
ఏలూరులో నాయన పేరొందిన 'లాయరు.' నెలకు వేయి
రూప్యములకుఁబైగా రాబడివచ్చును. ఎప్పుడును వచ్చుచు
బోవుచునుండు 'పార్టీ' లతో వారియిల్లు కిటకిట లాడు
చుండును. ఆయన మోమోటము లేనివాఁడని కొందఱును,
లోభియని కొందఱును బలుకుచుందురు. ఆర్జించుటలో నారి
తేరినవాఁడు. వ్యయమొనర్చుపట్టుల నతి జాగరూకత వహించు
వాఁడు. తాను సంపాదించిన ధనమంతయు 'నింపీరియల్
బ్యాంకు' నందు నిక్షిప్తమొనర్చెను. తోడి న్యాయవాదు
లాతని లోభత్వమున కప్పుడప్పుడు వేళాకోళములు చేయు
చుందురు. "ఎగతాళిచేసినవా రెవ్వరును నాకొక రూకనూరక
నీయరు. అనవసరపు డంబములకుఁబోయి నా సంసారమును
బాడుచేసికొనమందురా? భోగములనుభవించుటకుఁ
గూడ నవధియుండవలెను." అని వారికి సమాధానము
చెప్పును. మఱియొకప్పుడు చనవుగలవా రాయనతో
"సుందరరావుగారూ! మీ క్రొత్తకారెప్పుడు వచ్చును?

తెప్పించుచుంటిరిగదా!" యని హాస్యములాడగా నాయన" వారితో " అనుభవము తక్కువచే నట్లను చున్నారు కాని ఎట్టివారు మోటారును గొనవలెను? లక్షల ద్రవ్యమైనను ఖర్చుచేయుట మొదలుపెట్టిన నెంతకాల మాగును? మీసిద్ధాంతములకును నాయభిప్రాయములకును హాస్తిమశకాంతరము గలదు. మీరు దానధర్మములు చేయ వలెనందురు. నేనుచేయరాదందును. బీదసాదలకు దానధర్మము లొనర్చుచు గొందఱు దాము పుణ్యమును సంపాదించుకొను చున్నామని సంతసించుచుందురు. అది నాదృష్టిలో మంచి పనికాదు. ప్రతిమానవుఁడును పనిచేయుచునే యుండవలెను. అది తన విధ్యుక్తధర్మ నిర్వాహణమని తలంపవలెను. శరీరము నాయాసపెట్టక యూరక నితరులకడనుండి ధనమునపేక్షించుట సజ్జన లక్షణముకాదు. ధనమార్జించుటలోని కష్టము ఆర్జనపరు లెఱుఁగుదురు. పూర్వులు సంపాదించిన యాస్తిపై జీవించు వారికి విత్తమువిలువ తెలియదు. యథేచ్ఛముగ ఖర్చు పెట్టుదురు. అంతులేని భోగములనుభవించుచుందురు. కదలిన మెదలిన నౌకరులు, వాహనములు గావలసియుండును. దేహ దార్ఢ్యములేక కదల మెదల లేనివారికి సేవకులును, వాహన ములును గావలెనుగాని భగవంతుఁడొసఁగిన యవయవములు సరిగనుండగా నివి యేలకావలెను? విలువగల దుస్తులను ధరించుటలేదనియు, కోర్టునకు బోవుటకు నాకొక్కటేకోటున్న

దనియు మీలో మీరు గుసగుసలాడుటకూడ నాచెవుల కెక్కనిదికాదు. వస్త్రధారణము మానరక్షణమునకుఁగాని కేవలమందమునకై కాదుగదా! మన పూర్వులు కష్టపడి నూలువడికి నేసికొని కట్టుకొనుటలో నిహపరసాధనములు రెండును నిమిడియున్నవి. గాంధిమహాత్ముని సిద్ధాంతములలో నీవస్త్రవిధానము నామనస్సునకు నచ్చినది. అప్పుడప్పుడుమీరు నేను లక్షలధికారినై యుండియుఁ గోర్టునకు నడచియే వెళ్లుదు ననియు, ముగ్గురుగుమాస్తాలకుఁబనియుండఁగానొక్కనినే నియమించితి ననియుఁగూడ జెప్పుకొనుచుందురు. నడచివెళ్ళుటలో ననేకోపయోగములున్నవి. శరీరమారోగ్యముగ నుండును. మార్గమున ననేకమందితో మాటలాడుచుఁబోవచ్చును. వారి వలనవిశేషాంశములనెట్లుగవచ్చును. వారితో స్నేహమేర్పడుట కవకాశముండును. ఎప్పుడైనను వారిస్నేహము మనవృత్తినభి వృద్ధిపరచుట కవకాశము కలిగించవచ్చును. మఱియు నిరాడంబరజీవితమును గడపినవారమగుదుము. ఇఁకపవలు, నేను గోర్టులో పనిచేసినపిమ్మట రాత్రిపదునొకండు గంటలవఱకు నుఅవసరమైన కాగితములను జూచుటకు వినియోగింతును. పనికలిగిన తెల్లవారుజామున లేచిమఱలకార్యవ్యగ్రుఁడనగుదును. ఇట్లుభగవంతుఁడారోగ్యమొసఁగి నపుడే యొడలువంచి పని చేయుటకుఁ బూనుకొనవలెను. అనవసరముగఁ బేరుప్రతిష్ఠలకై పదిమంది గుమాస్తాలనుంచిన ప్రయోజనమేమి? తలచుము

వారందరును నాకుమారుఁడు మోహనుని వివాహమైనపుడు 'లాయర్లకు' అధమ మొక తేనేటివిందైన నొసఁగలేదని హేళన చేయుచుందురు. ఇదిచాల హాస్యాస్పదమైన కోరిక. విందులు, తేనీటివిందులును మనలో మన మేకదా చేసికొనునది. మనలో తేనీరును అల్పాహారములును దిననివారుండరు. అట్టిచో వారినిదీసికొనివచ్చి విందులొసఁగుటలో నర్థమేమికలదు? అందఱను బిలిచినచో వారికిసగౌరవముగ నాతిథ్యమొసంగి పంపవలెను. ఆగజిబిజి సమయములో నిట్టివి ఏర్పాటుచేసి గౌరవభంగముకలిగించితిమని ఎల్లరచేమాటపడుటకంటెనూరకొనుట శ్రేయోదాయకము.'' ఇట్లు సుందరరావుగారు తలచు తోటి న్యాయవాదులతో వాదించుచుండును. ఎల్లరును ఆయన నొకవిచిత్రవ్యక్తియని యెన్నుచుందురు. ఆయనది వితండవాదమనికొందఱుతలతురు. లోభియందురు. గడుసువాడందురు. ఏమన్న ఆయన లెక్కచేయడు. కోర్టులో ఆయనకు బదులు చెప్పుటకు ధర్మశాస్త్రాంశములలో ఆయనకుఁగల ప్రతిభకు నెల్లఱును నధైర్యమును నాశ్చర్యమును వహింతురు.

ఆదినమాదివారము. సుందరరావుగారిగృహము పార్టీలతో క్రొక్కిసలాడుచుండెను. గంభీరమూర్తియై యాయన యనేకవిషయములు వారితోఁ బ్రసంగించుచుండెను. క్రిందటి దినముననే యొకదావా సుందరరావుగారికి వ్యతిరేకముగఁ దీర్పు చెప్పబడెను. అందు తాను వాదించిన ధర్మ

శాస్త్రాంశములు "జడ్జీ"కి అర్థము కాలేదనియు, అప్పీలులోఁ దనకుతప్పక జయమగుననియు నచటఁగల 'పార్టీ' కాతడు నచ్చజెప్పుచుండెను. క్రమముగ భోజనపువేళ యగుసరికెల్లరు నటనుండివెళ్ళిపోయిరి. సుమారు పదునొకొండు గంటలు దాటి నది. ఆ సమయమున నుమాపతి చేత నొకతోలుసంచి పుచ్చు కొని వారిగృహమునఁ బ్రవేశించెను. సుందరరావుగా రాయ నను జూచుటయే తడువుగ లోనికేగెను. ఉమాపతియదిగాంచి ఖిన్నుఁడై యచటనున్న యొకబల్లపైఁ గూలబడెను. ఒకింత తడవునకు సుదరరావుగారి భార్య సుందరమ్మగారు రేతెంచి యుమాపతివైపునకుదృష్టిసారించిరి. అపుడుమాపతియామెతో

ఉమా—అక్కగారూ! అందఱును కుశలముగ నున్నారా?

సుంద—ఆఁ,కుశలమున కేమిలోటు. మీసంబంధమేనాఁడు చేసి కొంటిమోఆనాఁటినుండియే! మాకుకావలసినంతకుశలము.

ఉమా—అక్కగారూ! ఏవైన పొరపాట్లున్న సర్దుకొనవల యునుగాని ఇట్లు...

సుంద—ఎట్లు? అపుడే మిమ్ముల నేమియో దూషించినట్లు చెప్పుచున్నారే! మీరేమిచేసినను నోరుమూసికొనియూర కున్న మామంచియు మర్యాదయు దక్కును. లేకున్న మేము గయ్యాళివారమగుదుము. అంతియేగదా! మాటలు నేర్చియుండవలెను.

ఉమా—అక్కగారూ! ఏల అట్లుతొందరపడియెదరు ? మేము మీకు కావలసినవారమే కాని అన్యులము కాముగదా !

సుంద—కావలసినవారు కనుకనే మాకష్టసుఖములతో నిమిత్తములేకుండగ నత్తవారియింటికి బంపకకొమార్తను ఇంటనుంచుకొన్నారు. ఎదిగినపిల్ల. ఎవరైనను నవ్వుదురని యైనఁదలంపరైతిరి! మీరుకాబట్టి యట్లుధైర్యము వహించి యీడు పిల్లనట్లింట నిడుకొన్నారుకాని ఎవరట్టిసాహసము జేయగలరు ?

ఉమా—బావగారిపేర నేనెన్నిమారు లుత్తరము వ్రాసినను బిల్లను తీసికొనిరండని సమాధానము వ్రాయకపోయిరి. మోహానునిపేర నెన్నిరోజాబులు వ్రాసితిని. అతఁడెప్పుడు సమాధానమిచ్చినను గట్నపురూపాయలతోఁబిల్లను పంపవలసినదిగ మోమాటములేక వ్రాసెను. ఇఁకనేనేమిసేయ గలను ?

సుంద—కట్నపు రూపాయలడిగెనని మావానిపై నేరమా? అడుగునంత వరకును ఏపెద్దమనుష్యుఁడైన బెండ్లినాఁడిత్తునన్నకట్నపు రూపాయలీయకుండునా? ఇప్పటివలెకడిగినమాత్ర మీయఁగలిగిరా ?

ఉమా—అక్కగారూ! ఆవిషయమున నేరమంతయునాదియే. కాలము మారుటచే గొంచెమాలస్యమగుచున్నది. బంధువు

లైనతరువాత లోపములున్న మీరుసర్దుకొనక పోయినచో
మమ్మెవరాదరింతురు ? మోహనుఁడు చిన్నవాఁడు. ఆతని
కిని మీరేచెప్పి కొంతకాలవ్యవధి నొసంగినచో గొలఁది
మాసములలో నన్నమాట ప్రకారము నడచుకొందును.

సుంద—ఆహా ? బంధుత్వము ! మీ మాబంధుత్వ మనుగ
నక్కఱలేదు. మాపై మీరుచూపుచున్న ప్రేమకు చాల
సంతోషము గలుగుచున్నది. మీ యూహాలు మీ పద్ధ
తులును నాకుఁదెలియనివికావు. ఐనను మీతో నాకీవాద
మెందులకు ?

ఉమా—అక్కగారూ ! ఇందు వాదమేమున్నది ? కష్టసుఖ
ములు మంచిచెడ్డలు బంధువులైన తరువాతఁ జెప్పుకొనక
యుండరుగదా ! మీతోడను, బావగారితోడను చిరంజీవి
మోహను నితోడను గట్నపుసొమ్మునకై కొంతకాల
మోపికపట్టుడని చెప్పుటకే వచ్చితిని.

సుంద—ఓపిక. నే బ్రతికియున్నంతకాలము నోపిక పట్టుట
తోడనే వెళ్ళిపోవును. కుమారుడనియుఁ గోడలనియు నింటఁ
దిరుగుచుండగాఁ జూచి సంతోషించుభాగ్య మీజన్మకు
లేదు. ఆపైన నేఁజూడరానుగదా ? (కనులనీరునించును.)

ఉమా—అక్కగారూ ? విచారింపకుఁడు. త్వరలోనే మీకోడ
లిని మీయింటికిఁబంపు నేర్పాటు కావింతును. ఆలస్యమగు
చున్నందులకు మేము తలయెత్తుకొనలేకుండ నుంటిమి.

సుంద——నాకడ మీ వినయములేకాని సినీమాలకై మా కోడలు ఏలూరు ఎన్నిమారులురాలేదు? ఒదినగారెన్ని మారులు తన సోదరునియింటికి రాలేదు? ఒక్కమారైన మాగుమ్మముద్రొక్కిన పాపమునఁ బోలేదుకదా! పిల్లి కండ్లుమూసికొని పాలుత్రాగుచున్న లోకము చూడ కుండునా?

ఉమా——(ఆశ్చర్య విషాదములతో) వ్యవధిలేక యిచటకు రాలేదు. అంతియేకాని వేఱొకటికాదు.

సుంద——(తలయూచుచు) ఔనౌను. సినిమాలుచూచుటకున్న వ్యవధి మాయింటికి వచ్చుటకుండదు. ఐనను నాకెందులకీ కంఠశోష? మీ కొమార్తను బంపుదు, పంపకుండుదు. వంటయింట నాకుఁ బనియున్నది నేఁ బోవుచున్నాను.

ఉమా——అక్కగారూ! బావగారి నొకసారియిటు దయచేయు మని తెల్పుడు.

(సుందరరావుగారు ప్రవేశింతురు.)

ఉమా—— బావగారూ! నమస్కారము. ఆరోగ్యము గ నున్నారా?

సుంద——పర్వతమువలెఁ గనిపించుచుండగా నారోగ్యమా యని ప్రశ్నింపఁ బనిలేదు. భోజనమొనర్చి రాజమండ్రి వెళ్లదలఁచితిని. మీరు వచ్చినపని?

**ఉమా**—నాకు చిరంజీవి కీయవలసిన కట్నపు సొమ్మునకుఁ గొంతకాలవ్యవధి కావలెను. అది తమచే ననిపించుకొని పోఁదలఁచి వచ్చితిని.

**సుంద**—కట్నపుసొమ్మువిషయమై ప్రస్తావించి నాకుఁ గోపము తెప్పింపకుడు. మర్యాదగా నిటనుండి దయ చేయుడు.

**ఉమా**—(నిర్విణ్ణుఁడై) కాదు-బావగారూ !

**సుంద**—అంతతో నాగుడు. లోకువచేతనే కదా మాకీయవల సిన ధనమీయకపోతిరి? పోనిండు. మీవంశమర్యాదనెఱుం గక వారును వీరును జెప్పినపెద్దమాటలు నమ్మి మోస పోయితిమి.

**ఉమా**—ఇందు మీరు మోసపోయిన దేమియు లేదు. బావ గారూ !

**సుంద**—ఏమియు లేదు. బావగారూ ! నిజమే! ఈ మోస పోవుట చాలదు. మీ మనస్సులో నెంత యున్నదో అంతయుఁ జేయుడు.

**ఉమా**—(కొంచెము కోపించి) బావగారూ! ఇంటికివచ్చితిని కదాయని మంచియుఁ జెడ్డయు నాలోచింపక మీయిష్టము వచ్చినట్లు మాటలాడకుడు. కాలము ఒక్కతీరుగ నెవ్వ రికిని సాగదు.

సుంద—ఏమా పౌరుషము ? పౌరుషవంతులైన ఆడినమాటఁ దప్పకుండఁగ నుండవలయును. తప్పు దగ్గరనుంచుకొని మాటపడుటకుఁగూడ కష్టమా ? ఏ మొగము పెట్టుకొని వచ్చితిరి ? సామ్మాయ లేనని చెప్పుటకు వచ్చికూడ పౌరుషముఁ బ్రదర్శింపవలెనా ? చాలునంతతో నూరకొనుడు.

ఉమా—ఎగవేయువారిని మీరేమియుఁ జేయఁజాలరు. భయపడుచుఁ జేతులు కట్టుకొనివచ్చి యిత్తునని చెప్పెడినన్నె యిట్లు దూషించుట కాని–

సుంద—(కోపముతో) ఊరకొనవయ్యా ! పెద్దమనుష్యునివలె మాటలాడ వచ్చుచుంటివి. అంతమాటపడుట కిష్టము లేనిచో మాయిరువది వేలరూపాయలను ఇటు పా ఱ వేయుడు.

ఉమా—(ఆశ్చర్యముతో) ఇరువదివేలా ! వివాహసమయమున నే నిత్తుననిపలికినది పదివేలేకదా !

సుంద—ఓహో ! ఏమి తెలివితేటలుగలవాడవగుదువయ్యా ! ఆఱేండ్లకొకసారి ధనద్విగుణమగునుగదా ! తెలియనివానివలె నటించుచుంటివే ! నీనటనలు నాకడ నిఁక సాగవు. నా యోపికకుఁగూడ నవధియున్నది. మీయింట ఖర్చులకు ధన మెక్కడనుండి వచ్చుచున్నది ? ఈ నడుమ నగ లమ్మిన సొమ్మేమిచేసినారు ? రాజమండ్రిలోఁగల గృహ

మమ్మిన సౌమ్మెమైనది! నా కేమియుఁ దెలియదనియా నీయూహ. తొందరపడి నిన్నును,నీకుటుంబమునునాశనము చేయు తలంపులేక యింతకాల మూగితిని. ఇదిగో నేఁటితో నావలన దోషముండనట్లు చేసితివి. నీవు వచ్చుటకు ముందు కొమార్తతో నుత్తర మేల వ్రాయించితివి? అది యొక యుపాయమా? ఆ జాబు చూచి మావాడు మోస పోవుననియా నీ యూహ. ఇట్టి నక్కజిత్తులు నాకడ నిఁక నెప్పుడును బ్రదర్శింపకుము.

ఉమా—(ఆశ్చర్యవిషాదములతో) ఉత్తరమా! మాఅమ్మాయి వ్రాసినదా?

సుంద—ఏమీ ఆశ్చర్యము. ఈ నటనలు నాకడ సాగవు. ఒక నెలదినములవరకును గడువిచ్చుచున్నాను. వెనుకముందు లాలోచించుకొని ఇరువదివేలును దెచ్చియిమ్ము. లేదా మీ అమ్మాయికాపురమునకు ఆశ వదలుకొనుము. మగ వానికి వానికిఁ దప్పులేదు. వేఱొక వివాహ మాడి సుఖించును.

ఉమా—(దుఃఖముతో) వేఱొకవివాహమా! బావగారూ నన్ను క్షమింపుడు.

సుంద—నేనుకాదు, అందఱను సర్వేశ్వరుడు క్షమింపవలెను. పురుషుఁడై పుట్టినతరువాత నీతినియమములుండవలయును.

బాధ్యతల గుర్తెఱుంగవలయును. అడవిలోఁబుట్టి యడవిలోఁ బ్రవర్తించుచున్నట్లు మెలఁగరాదు. నా మనస్సు తొందరపడదు. జాగరూకతతో దేనినైన నాలోచించి కాని చేయనొల్లదు. ఒకటికాదు, రెండుకాదు. ఆరేండ్లు ఓపిక పట్టితిని. నీకుఁ జీమకుట్టలేదు. నలుగురలోఁ దిరుగ నేర్చినవాఁడవు. అల్లునకిత్తుననిన కట్నమెగవేయుటకు నీకు మనసెట్లు వచ్చినది? ఎంతకాలము మాయనాటకమాడ గలవు? ఇదిగో నేను మంచివారికిఁ జాలమంచివాడను చెడ్డవారికి నాయంత చెడ్డవాడింకొకఁడుండడు. గుర్తుంచు కొనుము. సుందరరావు అప్రయోజకుఁడుగాఁడు. ప్రపంచ మెఱుఁగని మూఢుఁడుకాఁడు. ఆడుదానియట్లుకన్నుల నీరేల నింతువు. పొమ్ము వెంటనే యింటికిపోయి నెలదినములలో నిరువదివేల రూపాయలనుదెమ్ము. లేనిచో—నానోటనేల పలికింతువు? మావానికి ద్వితీయ వివాహము తప్పక చేసెదను. ఆవల నెంత విచారించినను లాభములేదు. దూరము యోజింపుము. పాపిష్ఠి ద్రవ్యమునకై పండువంటి కాపురమును ధ్వంసము చేయకుము. పెరమార్గముల బ్రయత్నింపకుము. ఏమి! మాటలాడవు. పన్నెండు గంటలు దాటినది, నే భోజనమునకుఁబోవలెను. ఏమాలోచించితివి?

**ఉమా**—(దుఃఖముతో వణకుచు) బావగారూ! క్షమింపుడు నా యందేదోషమును లేదు ...

**సుంద**—ఏదోషమును లేదుకాని ఈయవలసిన పైకము మాత్రమీయవు! పొమ్మా, మీయదృష్టమెట్లున్న నట్లగును.

(చివాలున తలుపు వేసికొని లోనికిబోవును)

సుందరరావు లోనికేగుటతోడనే ఉమాపతి నిశ్చేష్టుడై యొకింతసేపు అట నిలువునఁగూలబడియుండెను. కొండంత హృదయ భారముతో నాతఁడు లేచెను. వాకిట గావలియున్న కుక్క యాతనిఁ జూచి మొఱుగ సాగెను. మెల్లగ లేచి తలుపు తీసికొని వీథిలోనికి వచ్చెను. ఉదయమునుండియు భోజనము లేదు. ప్రొద్దు నడినెత్తికెక్కెను. అడుగులు తడబడుచుండ మెల్లగఁ బూటకూళ్ళ యింటికి వచ్చెను. అచట అన్నములేకపోయెను. వేఱొకచోటికేగెను. అచటను నన్నములేదు. మంచినీళ్ళ కుళాయికడకేగి కడుపునిండుగ నీరు త్రాగఁ దలంచెను. అందును నీరు రాకయుండెను. వేసవికాలము. ఈ చెవిగాడ్పు చెవినిగొట్టుచుండెను. ఆకలిబాధ భరింపరానిదయ్యెను. దాహమధికముగ నుండెను. కాలువయొడ్డుననున్న యొక యింటికేగి మంచితీర్థమును గ్రోలెను. పైనవేసికొనిన ఖండువాను నెత్తికిఁ జుట్టుకొనెను. కృష్ణకాలువవెంట వసంతవాడకు బయలుదేఱెను.

వసంతవాడ ఏలూరునకు పదునొకండుమైళ్ళదూరమున నున్నది. కాలువగట్టుదారి యొకింతదూరము. రోడ్డుమీదుగ నేగిన దగ్గరయగునుగాని చెట్లనీడయుండదు. ఒకింత చుట్టైనను దట్టముగఁ జెట్లుగల కృష్ణకాలువమార్గముఁ బట్టి యాతఁడు సిచ్చివానివలెఁ బయనమైపోయెను.

3

ప్రపంచమొక వస్తుప్రదర్శన శాలవంటిది. అందు భిన్న భిన్నాకారములుగల భిన్నభిన్న దృక్పథములుగల అనేకు లుందురు. ఒకరి యూహకు మఱియొకరి యూహ కేవలమువ్యతి రేకము. ఒకానొకఁడు పుణ్యాపాపములు లేవని చాటిచెప్పును. వేఱొకఁడు కలవని సోపపత్తికముగ రుజువుచేయును. ధనహీనత, సమాజమున నాదరము లేకుండుట మొదలగువానిని మానవ కల్పితములని యొకఁడనఁగా వానికి పూర్వజన్మలయందలి పుణ్యాపాపములు సద్వర్తనము మొదలగు నుత్తమాదర్శములు కారణములని వేఱొకఁడు తమగ్రంథములయందలి విషయ ముల నెత్తిచూపును. వ్యక్తుల కాహారవిహారములయందు సంపూర్ణ స్వేచ్ఛయుండుట యవసరమని యొకఁడు పలికిన దానిని'ఆస్వేచ్ఛ కొన్నికట్టుబాట్లకు లోనై యుండవలెననిమఱి

యొకఁడు సరిదిద్దును. తన కోరికల నెఱవేర్చుకొనుటకు మను జుఁడున్నతములును బవిత్రములునునైన మార్గముల ననుసరింప వలెనని యొకానొకఁడు పలుకగా నది వివేకహీనతకు మార్గ మని యింకొకడు హేళనచేయును. పరమేశ్వరుని యనుగ్ర హము లేనిదే యొకయాకైనఁ గదలదని పలికిన ఆస్తికుని వచ నములు నాస్తికుని శ్రోత్రాల నిమేషమైనను నిలువలేవు.

మతములన్నియు భగవంతునిదగ్గరకుఁ జేర్చుటకు మార్గ ములగునని సర్వమతసమానమును దూరదృష్టియుఁగల యొక యనుభవజ్ఞుఁ డుపన్యసింపగా మామతమొక్కటే భగవంతుని జేర్చునని యల్పజ్ఞుఁడొకండు హుంకరించును. విగ్రహారాధన యవివేకులపని యనఁగా నదియే ప్రథమకర్తవ్యమని యాతని కొకఁడు సోదాహరణముగ సమాధానము చెప్పును. ఇట్లు భిన్న ములుగనున్న మార్గముల సమన్వయపరచుకొని యుత్తమ మార్గగామియై న డ చు మా న వుఁ డే యు త్త ముఁ డు. మానావమానములు కష్టసుఖములు కలిమిలేములు మొదలగు ద్వంద్వములు మనుజుని అల్పతానల్పతలను దేల్చిచెప్పు కొలతబద్దలుగాఁబరిగణించుచు లోకమొకవిచిత్రతరానుభూతిని బ్రదర్శించుచున్నది. మనుజులందఱును సామాన్యముగ మంచి వారలేయగుదురు. పరిస్థితులనుబట్టియో బుద్ధివిశేషము ననుస రించియో, సమాజముతోఁగల సన్నిహితసంబంధము నాధా రముచేసికొనియో మంచిచెడుగులు మనుజుల నాశ్రయించును.

తానుదలంచినదెల్ల సక్రమముగ నెఱవేరుచు, పోయిన మార్గ మెల్ల ననుకూలమగుచు కలిసివచ్చినా యాతఁడు సంఘము నందొక గౌరవనీయుఁడుగఁజెల్లుబడియగును. లేదా యెల్లరచే హీనముగ.జూడబడును.ఇదిలోకమున నడుచుచున్నయొక విచిత్ర విధానము. ఉమాపతిమనమున నల్లునియొక్కయు నూరయ్యగారి యొక్కయు ఋణములనుదీర్చవలెనను సంకల్పము స్థిరమై యుండెను. అతఁడుమనుష్య ప్రయత్నములన్నియుఁ జేసెను. ఒక టియునాతనికిఁగలిసి రాలేదు.సుందరరావుగారుతన్నాడినమాట లాతనికి హృదయవేదన గలిగించెను. సహజముగ నుమాపతి మృదులహృదయుఁడు,పరులకష్టములు జూచిసహింపలేనివాఁడు. డాంబికములకుఁ బోని సద్వర్తనుఁడు. ధార్మికచింతగలవాడు. మాటపడలేని మనీషావంతుఁడు. అగుటచేతనే వియ్యంకుని యనుచితవాక్యములాతనికి భరింపరానివయ్యెను. ఆయనమాట లొక్కొక్కటే పలుసారులు చెవులలోగింగురుమని మ్రోతలుపెట్టు చుండెను. వివాహమైన యన్నిసంవత్సరములైనను గట్టునపు సొమ్మియకుండుటతప్పేయనియాతని కనిపించెను. ఏమిచేయుట కును దోచలేదు. తనకడ నిలువధనములేదు. ఉన్నభూములను గొనువారులేరు. హెచ్చువడ్డీలపైఁదెచ్చిన మొత్తము దినదిన మును సంతానమిానుచుండెను. తనకాకష్టసమయములోనుచిత మగు సలహానొసంగి యాదుకొనువారెవరును లేకుండిరి. గ్రామ ములో ననేకమందికి క్లిష్టపరిస్థితులలోఁదగుల్కొనునప్పుడు తానై

ఎల్లరకగట్టెక్కించెను. ఆపత్సమయమునందనకు సలహాసంగు వారుకూడ లేకపోయిరి. ఇట్టి విపత్కరపరిస్థితులలో ధైర్యమును వీడరాదని యాతండెఱుంగును. కాని ఏ మాత్ర మాలంబన మాతనికి లభించినను ఈవిషయ మాతండు మనసునకెక్కనీయక యుండగలిగెడివాడే ! అట్లుజరుగలేదు. కనుకనే రాత్రింబవ ళ్లాతని కీవిషయమే యాలోచనాంశమయ్యెను. రాధమ్మగారు లోకవృత్తమెఱింగిన యిల్లాలుకాదు. భర్తకు ధైర్యము చెప్ప గలిగిన వివేకవతి కాదు. సామాన్యగృహిణిగా, కల్లకపటమెఱు గని సాధ్వీమణిగా మాత్రమామె చెల్లుబడియయ్యెను. పద్మిని యాలోచనలు నిరుపద్రవములై సమయానుకూలములై, లోకానుభూతిని ప్రదర్శించునవిగా నుండుట కవకాశము లేదు. ఏమన ఆమెవయస్సునుబట్టియు, గ్రంథపఠనముచే గలిగిన జ్ఞానమునుబట్టియే యూహించునుగాని, యథార్థదర్శకములుగ నుండుట కనువగు అనుభవముతో గూడిన సూక్ష్మజ్ఞానముతో నూహింపలేదు. అట్టిజ్ఞానము గ్రంథపఠనమువలనగాక వయస్సునుబట్టి యేర్పడును. కనుకనే కేవలపుస్తకజ్ఞానముగల వారికన్న నిరక్షరాస్యులగు పెద్దలజ్ఞానము సమాదరణీయమగు చున్నది. ఇక నుమాపతికి సలహాసంగు వారెవరు ! ఆ యూర సామాన్యసంసారులెల్లరు నుమాపతిసలహాలపై నడచు చుండిరి. ఆయనకే పాలుపోవని యంశముల నాయూరనెవండు తేల్చిచెప్పగలడు ? ఉమాపతిపుత్రుండు కృష్ణమూర్తి పదునెని

మిది, పందొమ్మిది వయస్సుగలవాఁడు. తండ్రియింటికడనుండి
అడిగినధనము పంపించుటయు సుఖముగ దాను వ్యయమొన
ర్చుటయు మాత్రమాతనికిఁదెలియును. కనుకనాతనివలనగూడ
ప్రయోజనము లేదు. పోఁగా నుమాపతిసోదరుఁడు సత్యమూర్తి
యొకఁడా కుటుంబమునకు సన్నిహిత బంధువున్నాఁడు. సత్య
మూర్తి ఆంగ్లవిద్యాభ్యాసము చేసినవాఁడు. ప్రజలతో కలిసి
మెలసి యుండుట కంగీకరింపని తత్వముగలవాడు. తండ్రిమరణా
నంతర ముమాపతియే యాతనికి విద్యాబుద్ధులు చెప్పించెను.
విద్యకు స్వస్తిచెప్పినపిమ్మట వివాహము చేసికొనెను. ఆపిమ్మట
నాతని వర్తనలో మిగుల మార్పుకలిగెను. చెడ్డయలవాట్లు
ఆతనిని వరించెను. తత్ఫలితముగ ఆస్తిపోయెను. ఆతఁడుమా
పతికరుణించి యొసంగినభూమితో జీవితమును గడపుచుండెను.
ఆస్తిపంచుకొనిన తొలిదినములలో నాతఁడొక మతాబువలె
వెలిగెను. బీదతనము తన్నాశ్రయించుట యాతనికి భరింపరాని
దయ్యెను. గ్రామములో లౌక్యవృత్తి నవలంబించెను. బ్రతికి
చెడినవాఁడనియు, చదువుకొన్నవాడనియు గ్రామస్థులాతనిపై
నభిమానముంచిరి. ప్రజలతో కలసి మెలసియుండుట కిష్టపడని
ఆతని మానసిక ప్రవృత్తి క్రమముగ సన్నగిల్లెను. అన్నయగు
నుమాపతి చెప్పుచేతలలోనున్న గ్రామము నాతఁడు తనవైపు
నకుఁ ద్రిప్పుకొనఁదలచెను. స్వీయ వ్యవహారములలోనుండి
యుమాపతి గ్రామవిషయములఁ బట్టించుకొనుట మానివేసెను.

సత్యమూర్తికాస్థానము నాక్రమించుట తన్మూలమున సుకర మయ్యెను. గ్రామమున దేవునికల్యాణములు, వనసమారాధనలు, జాతరలు మొదలగు గ్రామ సమిష్టికార్యము లాతనిచెప్పుచేతల లోనే జరుగసాగెను. పెద్ద పిన్నలు గ్రామమునకు వచ్చినపుడు సత్యమూర్తి వారితో సంభాషించి పరిచయము చేసికొను చుండెను. నలుగురితో మాటలాడుటనుజూచిన యమాయికు లగు నాగ్రామవాసులకాతఁడు తమకష్టసుఖములు విచారించు మేధావిగా భాసించెను. గ్రామమున సూరయ్యగారు విత్త మున్న పెద్దమనుష్యుఁడు. ఆయనకును సత్యమూర్తికిని పూర్వము కన్న మైత్రి యేర్పడెను. గ్రామమందలి పాటకపువర్ణమును, రైతులును సూరయ్యగారికి కొంచెముగనో గొప్పగనో ధన మీయవలసినవారే! వారికడ బాకీలువసూలుచేయుట, వడ్డీలు కట్టుట మొదలగు కార్యములు సత్యమూర్తి చేసిపెట్టుచుండు టచే సూరయ్యగారి కాదరణపాత్రుఁడును, గ్రామస్థుల కారాధ నీయుఁడును గాఁజొచ్చెను.

క్రమక్రమముగ నా యూరగల చిన్నచిన్న తగాదాలు సత్యమూర్తిచేఁ బహిష్కరింపఁబడుచుండెను. తన కెదురు తిరిగినవారి కార్యములు సత్యమూర్తి కోర్టు కెక్కించు చుండెను. అనతికాలముననే యాతఁడా గ్రామమున నొక పెద్దమనుష్యుఁడయ్యెను. ఈ వృత్తివలన నాతని రాబడియు హెచ్చెను.

ఇట్టిస్థితిలోనున్న సోదరుఁడు సత్యమూర్తితో నుమాపతి తనవిషయమును జెప్పి సలహా నడుగుటకుఁ బిలిపించెను. సత్యమూర్తి యొకింత యాలస్యముచేసి యన్నకడకు వచ్చెను. తమ్మునిఁ జూచుటతోడనే యుమాపతి లేచి యాతని రమ్మని యాహ్వానించి పశువుల పాకలోనికిఁ దీసికొనిపోయెను. అచట నొక గోడనానియున్న యరుగుపై నిరువురును గూరుచుండిరి. ఆతనితో నుమాపతి

"తమ్ముఁడూ! నా విషయము నీతో చెప్పవలెనని పలుదినములనుండియుఁ బ్రయత్నముచేయుచుంటిని. సందర్భపడలేదు. కాలము మారినది. ఇటీవల నేఁగొనిన యీనాము భూములకు ద్రవ్యము నూరయ్యగారికడ పత్రము వ్రాసి తెచ్చితిని. మనము కొనుటయేమి భూములకు ధరలు తగ్గుటయేమి రెండు నొకదానివెనుక నొకటి జరిగినవి. ఏటేట వచ్చు ధాన్యము సంసార వ్యయమునకును శిస్తులకును వ్యవసాయపు ఖర్చులకును సరిగ సరిపోవుటలేదు. నూరయ్యగారివత్తిడి ఎక్కువగుచున్నది. దీనికితోడు అల్లుడు చిరంజీవి మోహనునకు పెండ్లినాడిత్తుమనిన కట్నపుసొమ్ము ఈయలేదు. తత్కారణముగనే పద్మినిని వారు తీసికొనివెళ్ళలేదు. వారి రాపిడియు మితిమీరినది. కృష్ణమూర్తికి పట్నమునకు నెలనెల పైకము పంపుట దుర్ఘటమగుచున్నది. ఈ నడుమ మీావదినె నగ లమ్మి నూరయ్యగారి కీయవలసిన వడ్డీక్రింద జమకట్టితిని.

రాజమహేంద్రవరమునఁగల యిల్లు విక్రయింపఁగా వచ్చిన యెనిమిదివేలును వారి వడ్డీ యిచ్చుటకే చాలలేదు. సూరయ్యగారు మోమోటము లేనివాఁడు. ఎప్పుడేమాట యనునో యని భయపడుచున్నాను. ఇపుడు నన్నేమిచేయ మందువు?

సత్య — ఈ విషయములన్నియు నీవరకే నాకుచెప్పక పోతివా? సూరయ్యగారసాధ్యులు. సుందరరావుగారును సామాన్యుఁడు కాఁడు. ఎవరైనను – పైకము వదలుకొనరుగదా! అంతపెద్ద మొత్తము మనకెవ్వరిత్తురు! కేవలము ధాన్యపుబస్తా రెండురూపాయలన్నర యగుటతో నెవరికిని పొలములపై నాసక్తిలేదు. ఎన్ని బస్తాలమ్మినను శిస్తులకును గృహకృత్యములకును సరిపోవుటలేదు. కాలము మిగుల గడ్డుగ నున్నది. వెంటనే చెప్పుమనిన నేనుమాత్రమేమి చెప్పగలను! నెమ్మదిమీఁద నాలోచింపవలెను.

ఉమా — అటులనే కానిమ్ము. నీవు బాగుగ నాలోచించి కర్తవ్యమును దెలియజేయుము. ఈలో నేనును నాశక్తి వంచనలేక యీ కష్టముగడచు నుపాయము నాలోచింతును.

సత్య — (ఆలోచించి) అన్నయ్యా! నీవద్ద పాతధాన్యమున్నదా! ఉన్నచో నాల్గుబస్తాలు పంపుము. బాత్తిగ క్రొత్తఅన్నము తినలేకుండఁగ నుంటిమి.

ఉమా—పాతధాన్యమా! ఇంకను ఐదుబస్తాలు మాత్రమున్నవి. సాయంకాలము కొట్టుతీయించి పాలేరుచే పంపెదను.

సత్య—అటులనే ఈసాయంకాలము కాకున్న రేపుఉదయము పంపవచ్చును. తొందరలేదు.

ఉమా—నేఁ జెప్పిన విషయములు నీవు మనసులో నుంచుకొని తగిన యుపాయమాలోచింపుము. తమ్ముఁడూ! నాకు మాత్రమిచ్చుట మనసులో మాట చెప్పుకొను వారెవరున్నారు? నీవే యీ సకలభారమును వహించి నన్నొకగట్టునకుఁ జేర్చుము. చిన్నవాడవైనను వ్యవహార విషయములలో మిన్నవైతివి. ఇది నీపనిగా నెంచుకొనుము.

సత్య—నాపని యొకటియు నీపని యొకటియునా? తప్పక దీని విషయమై నాశక్తి వంచనలేక పాటుపడెదను.

(ఇంతలో నుమాపతి పుత్రుఁడు వచ్చి తండ్రితో)

"నాన్నా వంటయైనది. అమ్మ రమ్మనుచున్నది." అనెను.

సత్య—అన్నయ్యా! భోజనమునకు కేగుము.

ఉమా – తమ్ముఁడూ! నీవును ఈపూట నిక్కడభోజనముచేయ లెమ్ము.

సత్య –వలదు. ఇంటిదగ్గర నాకై మామఁబదలు కనిపెట్టుకొని యుందును. నేనింటి కేగెదను. అవసరమని తోఁచినపుడెల్లఁ గబురంపుచుండుము. మఱచితిని నీకడపదిరూపాయలున్నచో నీయుము. మునసబుగారికీయవలసియున్నది. ఆయన

పదిరూపాయలకు మోమాటము లేకుండగఁ బదిసారులు కబురంపుచున్నాఁడు.

ఉమా—అటులనే ఇదిగో పదిరూపాయలనోటు (జేబునుండి తీసియిచ్చును)

సత్య—అన్నయ్యా! నే వెళ్లెదను.

ఉమా—నామాట జ్ఞాపకముండునుగదా!

సత్య—తప్పక—

ఉమాపతి మనసులోని మాటను మర్మములేకుండగఁ దమ్మునితో జెప్పెను. అట్లుచెప్పుట యాతనిమానసమున కొకింతయూరటగలిగించెను. మనస్సుచాలచిత్రమైనది. ఒకకష్ట సమయమున నాప్తులతోఁ దనవేదనను జెప్పుకొన్నచో నొకింత యా వేదన తగ్గినట్లుండును. మఱొకప్పుడు తా నేభావము లూహించుచున్నాడో యవియన్నియు జరిగినట్లు మిత్రులతోడనో బంధువులతోడనో చెప్పివైచును. సంభాషణలో నితరులపై లేనిదోషములారోపించి చెప్పివినువారికి విస్మయము గలిగించును. పదుగురొకరిపై ననవసరముగ నన్యాయముగ దోషమారోపించుచుండవిని,అది కేవలమసత్యమని తా నెఱిఁగియుండియు వారితోడనే నిందించుటలోఁ బాల్గొనును. ఒకప్పుడు ఎల్లరెఱిగినవిషయమైననుబరమరహస్యముట్లువినువారితోఁబల్కును తా ననుభవించుచున్న వేదన నితరులుగూడ ననుభవించు

చున్నట్లువినిపించురట్టు జెందును. ఎదుటివారుఆనందముననుండఁ దాను దుఃఖించును. ఎల్లరును దనతో సమానముగ విలపించుటలేదేయని పరితపించును. పాలబుగ్గలతో బోసినోటితో నమాయికముగ నవ్వు పాపను బుగ్గగిల్లి ఏడ్పించి తా నానందము నొందును. కండ్లయెదుట నిరాధారులై వస్త్రవిహీనులై విలపించు బీదల కొకదమ్మిడి నొసఁగుట కిష్టపడదు. పత్రికలలోఁ బ్రకటించు క్షామ నివారణ నిధికి వేయి రూకలు పంపించితృప్తిపడును. యథార్థవర్తనముతో నెల్లరు నుండవలెనని బోధించును. తనవిషయమున నది వర్తింపఁ జేయదు. ఇట్లు స్వాంతము నీటిపై నలలవలె వివిధములుగ నుండును. ఉమాపతి పాపము తమ్మునితోఁ దన స్థితిఁ జెప్పకొని, కొంతబాధను తాత్కాలికముగఁదగ్గించుకొనెను. మెల్లగ నడచి యింటిలోని కేగెను.

---

## ౮

ఉమాపతి ఏలూరునకుఁబోయి వచ్చి రెండు మూఁడు దినములయినది. అచ్చట నేమి జరిగినదియు నింట నెవ్వరికిని దెలియనీయ లేదు. రాధమ్మయు, పద్మినియు నాతని వైఖరిని

గమనించి ఏమియు ప్రశ్నింపక యూరకుండిరి. వియ్యాల వారింటఁ దనకు జరిగిన పరాభవమును జెప్పి వారి మనస్సు లకుఁ గష్టముఁ గలిగించుటకాతని కిష్టములేదు. అతని నడిగిన నేమి చెప్పునో యను భయముచేఁ బద్మినియు రాధమ్మయు నను క్షణమును దమలోఁదాము తల్లడిల్లుచుండిరి.

ఒక దినమున నుమాపతి సూర్యోదయము కాక పూర్వమే వీథియరుగుపై గూరుచుండి ముఖప్రక్షాళనముఁ జేయుచుండెను. వెలుగింకను రాలేదు. ఆసమయమున వెంకయ్య యను నొక రైతు ఉమాపతికడకువచ్చి "ఎవరా కూర్చున్నది ? ఉమ్మయ్యబాబేనా ?" యని ప్రశ్నించెను. "అవును. వెంకయ్యతాతా సైకిరమ్మని" యాతనినాహ్వా నించెను. వెంకయ్యవచ్చి ఉమాపతి ప్రక్కనే గోడ నానుకొని కూర్చుండెను. అపు డుమాపతి;

తాతా ! ఎక్కడనుండి వచ్చుచుంటివి ?

వెంక—ఇంటిదగ్గరనుండి. ఇక్కడికే. నీతో రహస్యముమాట లాడవలెనయ్యా.

ఉమా—నాతోనా ! ఏమారహస్యము !

వెంక—లోనికి పోవుదమా ?

ఉమా—తాతా ! నీవు పలుదోము కొంటివా ?

వెంక—ఐనదిబాబూ ! పద లోనికి.

(ఇరువురును లోనికేగి గదిలోఁ బ్రవేశింతురు)

వె—ఉమ్మయ్యా! వెనుక సూరయ్య అన్యాయముగ మా యాస్తిని హరింపవలెనని ప్రయత్నము చేసినపుడు ధర్మ మూర్తివి. నీవడ్డుపడి మాది ఒక శెంటు భూమి నష్టపడ కుండఁ గాపాడితివి. నాఁటినుండి నేటివరకును నీ దయ వలననే ఇంతయన్నము పిల్లలును నేనును దినుచున్నాము. ఆరోజులు గతించినవి. నీయెదుట ననరాదుగాని నీవు ధర్మ రాజవు. గ్రామములో నెవ్వరికైనఁ జేతనైన నుపకార మొనర్చుట లేనిచో మెదలకుండుటయే కాని యనవసర ముగ నన్నిటిలోనను దలదూర్చవు. ఈనడుమవింటిని. సూరయ్యకడ నీవు పత్రము వ్రాసితివటగా! మాకందఱి కును జెప్పెడివాడవు నీవెట్లుచ్చటి కేగితివయ్యా!

ఉమా—తాతా! ఈనామిపొలము నలుబది ఎకరములును గొనుటకు వెంటనే తీర్చవచ్చునుగదా యని యాపని చేసి తిని. ఒకదానికొకటి కలిసిరాలేదు. కాలము మారినది. ఇప్పటికి వడ్డి క్రిందనాయనకు పదునైదువేల రూపాయలు కట్టితిని. ఇంకకొంతకాల మాగుమని యాయనతోఁ జెప్పు టకుఁ బ్రయత్నము చేయుచున్నాను.

వెంక—సూరయ్య ఎవరిమాటవినును? అందును ఆతనికి డబ్బే ప్రధానము.

**ఉమా**——మాతమ్మ్మడు సత్యమూర్తియు నాతఁడును మిగుల స్నేహముతోనున్నారు. ఆతఁడేమైన సాయముచేయునేమో యని నిన్ననే పిలిపించిచెప్పితిని. మావాడు తప్పక ప్రయత్నము చేయుదుననిచెప్పెను.

**వెంక**——ఎంతపనిచేసితివి ?

**ఉమా**——ఏమి ?

**వేంక**——సత్తెయ్య మంచివాడు కాదయ్యా ! గ్రామమంతయుఁ బాడుచేయుచున్నాడు. ఆయనకు డబ్బే ప్రధానము సూరయ్యతోఁజేరి అబ్బో ! ఒకవిధముగనా ? వేయివిధములుగా ధనము సంపాదించుచున్నాడు. పిచ్చివాడవు ఆతడేమి? నీకుసలహా నొసంగుటఏమి? నీవామాత్రమూహింపజాలనివాఁడవా ? రాత్రిచాల ప్రొద్దుపోవు వరకును వారిరువురును సూరయ్యగారిబత్తాయితోటలోఁ గూరుచుండి రహస్యములాడుచున్నారు.

**ఉమా**—— అదియా నీసందేహము ! నేను మాతమ్మునితోఁ జెప్పిన విషయము నాతఁ డాతనితో సంప్రదించుచుండును.

**వెంక**——సంప్రదించుటకు చీకటిచాటున తోటకుఁ బోవలసిన యవసరమేమి ? ఇంటిలో మాటలాడిన నేమియభ్యంతర ముండును. అందఱను నీవిట్లే నమ్ముదువు.

**ఉమా**——మాతమ్మునిఁగూడ నమ్మరాదందువా ?

రాధ—నాల్గు దినములనుండియుఁ దిన్నగ నన్నము దినుట లేదు. ఒంటరిగ నుండి ఏడ్చుచున్నట్లున్నది. కండ్లువాచి యున్నవి. కారణమేమని యడిగితిని కానిచెప్పినదికాదు.

ఉమా—నాతోఁ జెప్పుతల్లీ! ఏల ఇట్లగుచున్నావు?

పద్మ—ఏమియు లేదు నాన్నగారు. కొంచెము శరీర మస్వస్థతగ నున్నది.

ఉమా—మందేమైనఁ బుచ్చుకొనకపోతివా?

పద్మ—అక్కర లేదు.

ఉమా—మఱచితిని— అమ్మా ఏలూరు నీవేమైన నుత్తరము వ్రాసితివటమ్మా?

పద్మ—(ఉలికిపడి ఊరకుండును)

ఉమా—చెప్పుతల్లీ! భయము లేదు.

పద్మ—(నెమ్మదిగ నధోముఖియై) వారి నిటకు రావలసినదిగను, గట్నపు ద్రవ్యమునకుఁ దొందరచేయ వలదనియుఁ బ్రార్థించుచు వ్రాసితిని.

ఉమా—అంతియేకదా! నే నేలూరు వెళ్ళినపుడు వారు నాతో నీ విషయమును ముచ్చటించినారు.

పద్మ—ఇంతకును వారేమనిరి?

రాధ—పిల్లనెప్పుడు దీసికొనివెళ్లుదుమని పలికిరి?

ఉమా— (తొట్రుపడుచు) సావకాశముగఁ దెల్పెదను. త్వరలోనే వెళ్ళవచ్చును.

(వీథిలోఁ గలకలము వినవచ్చును)

ఉమా—(తొందరగ) ఏ మా ధ్వని! నేను పోయి చూచి వచ్చెదను.

ఉమాపతి బయటకు వచ్చునప్పటికి వీథి చివర చాల మంది మూగియుండిరి. చరచర నడచుచు నుమాపతి యా ప్రదేశమున కేగెను. ఉమాపతి వచ్చుటను దిలకించి అచటి జనులెల్లరును దొలఁగి చనిరి. ఉమాపతి చూచునప్పటికి సత్య మూర్తిమెడలోని యుత్తరీయమును బట్టి యొకఁడు గుంజుచు దుర్భాష లాడుచుండెను. ఉమాపతినిఁ జూచుట తోడనే యాతఁ డుత్తరీయమును వదలి యాతనికి నమస్కరించెను. ఉమాపతి యాతనితో

"నరసయ్యా! ఏ మీ యాగడము?"

నర—లేదుబాబూ! సత్యయ్యగారొనర్చిన అఘాయిత్యమును జూడుడు. మా అన్నయు నేనును ఇంటిస్థలమువద్ద తగాదా పడి పెద్దవారు గదాయని వీరితోవచ్చి చెప్పుకొంటిమి. నా కనుకూలముగ నుండునట్లు చేసెదనని రహస్యముగ నాకడ పదిరూపాయలు తీసికొన్నారు. రాత్రి మాయిరువు రను బిలిపించి మాఅన్న కనుకూలముగఁ దీర్పుచెప్పినారు.

4

నాకడఁ దీసికొనిన పదిరూపాయలును దిరిగి నాకీయవల యునుగదా! ఇప్పుడు కనబడిరిగదాయని అడిగితిని. అడిగి నపుడు నెమ్మదిగఁ జెప్పవచ్చునా! నాకెవు డిచ్చితివని అనరాని మాటలాడుచున్నారు. ఈ గ్రామములో ఇన్ని నాళ్ళనుండియు నన్నుచూచుచున్నారు! నే నెట్టివాడనో తమకుఁదెలియును. నన్నిట్లన్యాయముచేయుట ధర్మమేనా? పెద్దలు తాము సెలవివ్వండి.

ఉమా—వాడు తొందరపడెనని నీవును తొందరపడవలెనా నరసయ్యా! చాలుచాలు! తరువాత చూచుకొనవచ్చును. విన్నవారు నవ్విపోదురు. నడుపుడు. ఇండ్లకుఁబొండు.

నర—చిత్తము. దండము బాబూ!

ఎల్లరును ఒక్కరొక్కరే యాప్రదేశమును వీడిపోయిరి. సత్యమూర్తియు ముఖము పెడగఁ ద్రిప్పుకొని యటనుండి వెడలిపోయెను. ఉమాపతి కాదృశ్యమాశ్చర్య విషాదములఁ గలుగఁజేసెను. నరసయ్యమాటల కెదురాడలేక పోవుటచే సత్యమూర్తి యాతనికడ పదిరూపాయలునుదీసికొనుట నిజమే యగునని యుమాపతి నిశ్చయించెను. గౌరవముగల కుటుంబ మున కాగ్రామమున నట్టి యమర్యాదాకరమగు సంఘటన కలుగుట ఆతనిచిత్తమునకు మిగుల బాధ కలిగించెను. ఉద యముననే వచ్చి వెంకయ్యగారు చెప్పిన మాటలు జ్ఞప్తికి

వచ్చెను. మనస్సు మఱియుఁ గలఁతఁజెందెను. నెమ్మదిగ నడ
చుచు నింటికిఁజేరెను.

ఇంటికిఁజేరెనను మాటయేకాని యుమాపతి కేమి
చేయుటకును దోచలేదు. గదిలో కుర్చీలోఁ గూరుచుండి
యాలోచనానిమగ్నుఁడయ్యెను. ఒక్కొక్కప్పు డాతఁడు
సత్యమూర్తి నమ్మదగినవాఁడు కాడనియు, వేఱొకప్పుడు
ఇంకను నిర్ధారణచేయుట కవకాశము లేదనియు తలఁచు
చుండెను. లోపలనుండి రాధమ్మ వచ్చి 'బజారునం దాకలకల
మేమ'ని యడిగెను. ఉమాపతి జరిగినదామెకుఁ జెప్పెను.
అంత నామె "ఈ సంగతులు మీతోఁజెప్పినను నమ్మరు.
మన యింటిప్రక్కనున్న సరస్వతమ్మ సత్యమూర్తి అట్టి
వాడనియు, సూరయ్యతో మనలను గూర్చి రహస్యములాడు
చున్నాడనియు ననేకదినములక్రిందటనే నాతోఁ జెప్పినది.
నేను మీతోఁజెప్పిన అసత్యములని నన్నుఁ జీవాట్లు పెట్టుదు
రని యూరకుంటిని. మొన్న మీరాతని గొడ్లసావడిలోనికిఁ
బిలిచి మాటలాడుట నా కిష్టము లేదు. లేదని నేను చెప్పిన
నా మాట వినరు. సమయము వచ్చినది కనుక చెప్పుటకు
సాహసించితిని. ఇఁక మీ యిష్టమ"ని యూరకుండెను.
ఉమాపతి యామెతో "లోకము అదిగో పులియనిన నిదిగో
తోకయనును. ఎవరో గిట్టనివారొక పుకారు లేవదీయుదురు.
అది యానోటనానోటఁ బడును. ఈ చెప్పుటలో నెవరి

యూహల ననుసరించి వారు కొంత కవిత్వ మల్లుదురు. చెప్పినదంతయు నిజముకాదు. అంతయు నబద్ధముకాదు. చూడుము. ఇట్టివి ఎవరిపైననైనను కొండెములు వినవలసి వచ్చినచో నావినుటనుండి దూరముగఁ దొలఁగుట మంచిది. తప్పక వినవలసియేవచ్చుచో వినినపిమ్మట వానికి మనస్సులోఁ దావీయరాదు. నేను జూచుకొందునులెమ్ము. లోనికేగి వంట త్వరగా జేయుమ"ని పలికెను. రాధమ్మ ఆమాటలకు బదులు చెప్పక లోనికేగెను. మఱల ఉమాపతిమనస్సునకొక దెబ్బ తగిలెను. ఎల్లరకును నావిషయము ముందుగ దెలియు చున్నది. నన్నుఁగూర్చినది నాకే తెలియుటలేదు. ఇది మిగుల విచిత్రము. లోకము సవ్యక్తినిగూర్చి చెడ్డగఁ జెప్పుకొనుచుండునో యా విషయమాతనికిఁ దప్ప సర్వుల కును దెలియదు. అందఱును దమలోఁ దాము తర్జన భర్జనలు చేసికొనుచు గుప్తముగ నుంచుదురు. సత్యమూర్తి మంచివాఁడుకాడని వసంతవాడలో నెల్లరకుఁ దెలిసెను. ఆవిషయ ముమాపతికి దెలియదు. ఉమాపతి సత్యమూర్తి వర్తనము తొలినాళ్లకన్న బాగుపడినదని యూహించెను. ఆ యూహ ఆతనిలో గట్టిగఁ బాదుకొనెను. ఇపుడాస్థానమున నొక క్రొత్త యూహ ప్రతిష్ఠింపఁబడవలెను. ఆతని ప్రకృతి తొందరపడునదికాదు. ఏదైన నొక యభిప్రాయమును సమగ్రముగఁ జర్చించిననే కాని యొక నిర్ణయమునకు రాదు.

వచ్చినా యది సామాన్యముగ మనసును వీడదు. ఇట్లగుట చేతనే సత్యమూర్తిని గూర్చిన యూహా అతనినిఁ ద్వరగా నొక స్థిరమైన యభిప్రాయమునకుఁ దీసికొనిరా లేకపోయెను.

అప్పటికి పదిగంటలయ్యెను. వేసవియగుటచే నెండ దుర్నిరీక్ష్యముగ నుండెను. పశువుల నూరి బయటకు గొల్ల కాపరులు దోలుకొని పోవుచుండిరి. గిత్తదూడలు చెఱువునకు నీటికై విప్పబడినవి వీథులలో విశృంఖలముగ గంతులు వేయుచుండెను. ఉదయముననే కూరగాయలమ్మకమునకుఁ దెచ్చినవారు తమతమ గ్రామముల కేగుచుండిరి. మండపముపై నెల్లరును జేరి లోకాభిరామాయణమును జెప్పుకొను చుండిరి. రైతులు క్రొత్తగ వేసిన కుప్పలు నూర్చుటకై తగు ప్రయత్నములు చేయుచుండిరి. స్థానికముగనున్న ప్రాథమిక పాఠశాలలలోని బాలబాలికలు పుస్తకములను జేతనిడుకొని తమతమ యిండ్లకుఁ బోవుచుండిరి. ఇంతలో సుమాపతి పాలేరు వచ్చి "మనపదియెకరముల చేను కుప్పనూర్చుటకు వీలుగ నేల తడియారినది. రెండుమూడుదినములలో నూర్పిడి మొదలు పెట్ట వచ్చును. ఏమందురు"ని ప్రశ్నించెను. దానికాతఁడు తప్పక ముందు నూర్చి ధాన్యమమ్మవలెను. శిష్యులకును మదరాసు పంపించుటకును బైకము చాల అవసరముగ నున్నది. కూలీలను బిలిపించి ఎల్లుండి నూర్పించుటకు ప్రయత్నము

చేయు''మని పలికెను. అంతతో నాతఁడు చిత్తమని సమాధానము చెప్పి వెడలిపోయెను.

తపాలా బంట్రోతు వచ్చి యొకకవరు చేతికొసంగి పోయెను. ఉమాపతి దానిని జింపెను. అది కృష్ణమూర్తి దగ్గర నుండి వచ్చెను. కాగితము మడతవిప్పి దాని నిట్లాతఁడు చదువసాగెను.

మదరాసు,
10-12-20.

ప్రియమైన నాయనగారికి,

నమస్కారములు.

ఇక్కడనేను క్షేమముగ నున్నాను. మీ క్షేమము వ్రాయుడు. క్రిందటి నెల నాకు మీరు పైకము పంపలేదు. కళాశాల జీతమును, హాస్టలు ఖర్చులును స్నేహితులనుండి బదులు తీసికొని చెల్లించితిని. చేతిలో నొకకానీలేదు. బయటకుఁ గదలిన నీ పట్టణములో పైకము కావలసియుండును. నిత్యము చేయుఖర్చులకుఁగూడ స్నేహితుల నడుగుటకు సిగ్గగుచున్నది. వారును ఇబ్బందిపడుచున్నారు. చాకలికి ఇంకను బది రూపాయలీయవలెను. అవి యిచ్చినఁగాని మాసినబట్టలు తీసికొని పోనని బెదరించుచున్నాఁడు. గది అద్దె నావంతు ఐదు రూపాయలీయవలెను. నెలనుండియు ఉదయమును మధ్యాహ్న

మును దీసికొను అల్పాహారములు తీసికొనుటలేదు. అందుచే కొంచెము నీరసముగ నున్నాను. ముఖ్యముగ నీ నెల ఇరువదవ తేదీ దాటకుండఁగ పరీక్షకు ఫీజుకట్టవలెను. ఈ యేటితో బి. ఎ. అగును కనుక మిమ్ములను బాధించను. వసంతవాడలో పరిస్థితులు నాకు అక్క జాబు వ్రాసినది. ఈ కష్టస్థితిలో మిమ్ములను బైకమునకు వత్తిడి చేయు చున్నందులకు మిగుల విచారించుచున్నాను. నేనుమీకు ఏవిషయమునను సాయముచేయలేకపోవుటయేకాక కష్టముగూడ కలిగించుచుంటిని. ఇదినామనస్సునకు మిగులబాధ కలిగించుచున్నది. మీరు విచారముతో నుత్సాహములేక యున్నట్లు తెలిసికొని బాధపడుచున్నాను. నాకు అనుభవములేదు. మీకుసర్వమును దెలియును. కష్టములు వచ్చినపుడే ధైర్యముగలిగియుండవలెనుగదా! ఆస్తి పోవునని మీరు విచారింపవద్దు? గౌరవమునకు లోటురాకుండఁ జేయుటకుఁ బ్రయత్నింపుడు. ధర ఎక్కువగా రాలేదని భూముల నమ్ముటమానవద్దు. ఏవిధముగనైన బావగారిడబ్బును, సూరయ్యగారి బాకీయును ఇచ్చివేయుటకుఁ బ్రయత్నము చేయుడు. ఇఁక రెండు మూఁడు నెలలలో మాకు సెలవులిచ్చెదరు. అపుడునేనింటికివత్తును. మీకష్టములో భాగముపంచుకొందును. అధైర్యముపడవద్దు. సత్యమూర్తిబాబాయిని కనిపెట్టిచూడుడు. ఆయన మనయెడల మొదటినుండియు నొకతీరుగ మెలగుచున్నాడు. అట్లని విరోధముపెట్టుకొనవద్దు.

ఏలూరులో బావగారింటనందఱును క్షేమముగనున్నారని తలచెదను. బావ మదరాసులో నుద్యోగములోఁ బ్రవేశించినాడు. మొన్నటిదివము నాకుఁగనిపించి మంచి చెడ్డలు మాటలాడినాడు. అతఁడు సౌమ్యునివలెనే యున్నాఁడు. సుందరరావుగారు అక్కను దీసికొని రావద్దని ఒత్తిడిచేయుచున్నట్లు అతని మాటలవలనఁ దెలిసికొంటిని. కాలము ఒక్కతీరుగనుండదు. అక్కను బెంగపెట్టుకొనవద్దని చెప్పవలెను. నేనుబావగారితో తఱచు కలసి మెలసి తిరుగుచుంటిని.

అమ్మ ఏమిచేయుచున్నది? ఆమెకల్ల కపటము లెఱుగనిది. మీకు ధైర్యముచెప్పుటకూడ ఆమెకుఁదెలియదు. మీరేమాత్రమును ధైర్యమును వీడరాదు. చెప్పుడు మాటలను నమ్మవలదు. నాఆరోగ్యము బాగుగనేయున్నది. వెంటనే మీ ఆరోగ్యమునుగూర్చి జాబువ్రాయుడు.

క్రిందటి నెలకును, ఈ నెలకును గలిపి ఖర్చులకును, పరీక్షఫీజునకును మొత్తము నాలుగువందలు పంపగోరెదను. ఒక్కసారిగనింత మొత్తము పంపుట కవకాశములేనిచో రెండు మారులుగ బంపుడు.

అమ్మకు సమస్కారములు. అక్కను అడిగితినని తెల్పుడు. తమ్ములిద్దఱితోడను నేనువచ్చునపుడు బహుమతులు

తీసికొని వచ్చెదనని చెప్పుడు. వెంటనే మీ యారోగ్యమును గూర్చి వ్రాయుడు. నమస్కారములు. సెలవు.

చిత్తగించవలెను.

విధేయుడు

కృష్ణమూర్తి

లేఖను జదివిన యుమాపతికన్నుల నీరునిండెను. కృష్ణమూర్తి యంతటి యూహకలవాడని యనుకొనలేదు. మోహనుఁడాతనికి గనిపించినందులకును, ఆతనితోఁ గృష్ణమూర్తిమైత్రి నెఱపుచున్నందులకును నానందించెను. కుటుంబబాధ్యత నాతఁడంతగ నవగాహన మొనర్చుకొనునని యుమాపతితలప లేదు. కృష్ణమూర్తి వ్రాసిన లేఖాంశములను ఇంటజదివి వినిపించుటకై లోనికిపోయెను.

---

## ౫

గాఢాంధకారములో నపుడపుడు నక్షత్రపుఁ గాంతి మినుకుమినుకుమనుచుండును. సముద్రమునఁబడి కొట్టుకొనిపోవు వానికి బ్రద్దలై చెదరిన యోడకొయ్య యొకటి యాధార మగును. అట్లే కష్టపరంపరలలోఁ జిక్కుకొనిన యుమాపతికి కుమారుని యుత్తర మొక సంతోషకారణమయ్యెను. కుటుంబ

గౌరవ విషయమై యాతఁడుచూపిన శ్రద్ధకు మిగుల నానం దించెను. పసివాఁడగు కృష్ణమూర్తియు సత్యమూర్తి విషయమై యొకింత జాగరూకత వహించుట యుత్తమమని సలహా నొసంగెను. ఇందఱిన్నివిధములుగఁ జెప్పుటచే నాతనిని గూర్చి యుమాపతికి ననుమానము లీలగ బొడసూపెను. కృష్ణ మూర్తిలో నీ మార్పువచ్చుటయే యుమాపతికి మిగుల నాశ్చర్యముఁ గలిగించెను. మోహనునితో నాతఁడు ప్రసం గించుట చాల యుక్తమైన పనియనియు నెంచెను.

ఉమాపతి కానాటి రాత్రి సరిగ నిద్దురపట్టలేదు. తానేలూరు వెళ్ళివచ్చుట, సుందరరావుగారి సంభాషణము అన్నియు జ్ఞప్తికివచ్చెను. సుందరరావుగారు కుమారునకు ద్వితీయ వివాహము సేతునని పలుకుట యాతని చెవిలో నిన దించెను. ఆ మాట తలచుటచేతనే యుమాపతి కలతఁజెందెను. తోడనే కృష్ణమూర్తి వ్రాసిన యుత్తరములో నాతఁడు సౌమ్యుఁ డని మోహనుని గూర్చిన ప్రశంసావాక్యము జ్ఞప్తికివచ్చెను. అపుడు మనస్సు కొంత శాంతించెను. ఆరాత్రియంతయు నేవేవియో కలలు దొంతరలు దొంతరలుగా వచ్చుచునే యుండెను. తెల్లవారుజామునకు కొంచెము కునుకుపట్టెను. ఆఱుగంటలకు మెలకువ వచ్చెను. తోడనే యాతఁడు కాల కృత్యములు తీర్చుకొని పొలమునకు బయలుదేఱెను. త్రోవలో నూరయ్య యాతనికిఁ గాన్పించెను. నూరయ్య ఇపుడు లక్షల

కధికారి. ఈ మాట తలచినపు డుమాపతికి చిఱునవ్వు వచ్చెను.

సూరయ్య వసంతవాడలో మొనమొన్నటివరకు మానిసిగా లెక్కింపబడలేదు. అతని వర్తనము పలువురు మెచ్చుటకు వీలైనది కాదు. చాలకాలమునుండియు నీతని వంశస్థులుదొంగ సొమ్ములు కొనుచుండు నలవాటు కలిగియుండిరి. తరతరములుగా వారికది యొకవృత్తిగాఁ బరిణమించెను. ఒకానొక సమయమునఁ గొందఱు దొంగలొక భాగ్యవంతునిగృహమునబడి యా యింటఁగల బంగారమునంతయు దోచికొనిరఁట! వాడుక ప్రకారము దొంగలు వీరి గృహమునఁ బ్రవేశించి యానగల నొసంగి ధనమిమ్మనిరి. దొంగలు చాలదూరమునుండి వచ్చుటచే వారచటకు వచ్చునప్పటికే మూఁడుగంటలయ్యెను. ఆయింటివారా సందు కనిపెట్టి దస్యులకు ధనమిచ్చుట కాలసించిరి. దొంగ లెంతకాల మటనుందురు? విసిగి లోలోన దూషించుకొనుచు నెవరికినిఁ జెప్పక తమదారిని పోయిరి. ఇది సూరయ్య తాతలనాఁటికథ. అప్పటినుండియు వీరు భోజనమునకుఁ దిప్పలుపడకుండ నుండిరి.

ఒకప్పుడు సూరయ్య మేనమామ చావు బ్రతుకులలో నుండెను. అతనికి నలుగురు పిల్లలు. వారందరును బసివారు. తన మరణసమయ మాసన్నమైనదని యూహించిన యాతఁడు

సూరయ్యకుఁ గబురంపెను. మంచిచెడ్డ లాతనితోఁ జెప్పెను. తాను వర్తకముచేసి సంపాదించిన ధనమున్న తావును దెలియఁ జేసెను. ఆ ధనమును బెంచితనసంతానమున కీయుమని యాతని వేడుకొనెను. సూరయ్య తలఁద్రిప్పెను. అతడు మరణించెను. సూరయ్య వసంతవాడలో నొక లక్షాధికారి యయ్యెను. ఇది సూరయ్యకథ.

సూరయ్యనుజూచుటతో ఈ రెండుఅంశములునునుమాపతి మనస్సులో విచిత్రముగా మెఱసినవి. తదేకధ్యానముతో నుమాపతి బొలమునకుఁ బోవుటను సూరయ్య గమనించెను.

ఉమాపతి బొలమునకుఁబోయి కుప్పనూర్చిడికి వీలగునట్టు కళ్ళముద్రొక్కించుమనిపాలేరుతోఁజెప్పెను. ఈ సంవత్సరము రాలుబళ్లు బాగుగనుండుననియు పెద్దపైరులలోఁ దెల్లకంకె కనపడినను పిదపవరియగు నక్కుళ్లు బాగుగ పండెననియు పాలేరు చెప్పెను. పది ఎకరములును నిరువదిపుట్లు తప్పక పండుననియు అంచనా వేసిరి. ప్రొద్దు జామెక్కెను. ఉమాపతి తిరిగి ఇంటికి బయలుదేరెను. కండువా తలకుఁ జుట్టుకొని ఉమాపతి యింటి కేతెంచుచుండెను. సూరయ్య యింటిముందునుండి పోవుచుండెను. అపుడు సూరయ్య "ఉమ్మయ్యా! పైకము సర్దుబాటగునా కాదా! నా కేసంగతియు మరలవచ్చి చెప్పవైతివి! పైకము చాల అవసరముగ నున్నది.

ఉమా——ఆ ప్రయత్నమే చేయుచుంటిని. ఏలూరు మార్వా డీలదగ్గర ప్రయత్నముచేయగా వారు చోటుపెట్టలేదు. వడ్డీ యీ సంవత్సరమునకుఁగూడ చెల్లించితినిగదా! ధాన్యమమ్మి కొంత సర్దుబాటు చేయగలను.

సూర——ఈ మాటలు చాలమాట్లు చెప్పితివి. నేను బిచ్చి వాఁడనుగనుక నీ కప్పిచ్చితిని? నీ కే తలకుమాసినవా డిచ్చునయ్యా? నా ఋణము తీర్చుటకు!

ఉమా——సూరయ్యా! మాటలతోఁ బనిలేదు. నీ ధనము నీకు తెచ్చియిచ్చుటకదా నీకు కావలసినది. కొంచె మోపిక పట్టుము.

సూర——ఈ యోపికపట్టుటకు అంతములేదా! నీవు బ్రతికి యున్నంతకాల మిట్లేయనుచుందువు.

ఉమా——నాకిపుడు మాటలతోఁ బనిలేదు. నీధన మిత్తునంటిని. నీవు అనవసరప్రసంగము చేయుచున్నావు. అది నేను సహించను.

సూర——అబ్బో! నాది యనవసరప్రసంగమును నీది అవసర ప్రసంగమునా! ఇచ్చినడబ్బడుగుట అనవసరప్రసంగము! అవును. తప్పునాదే! మరియొకసారి మాటాడిన తమకు మర్యాదాభంగము! ఆహా ఏమికాలము! ఉమాపతిగారూ దయచేసి నా పైక మిప్పింపుడు.

ఉమా—(రోషముతో) సూరయ్యా! నీమాత్రము తెలివి తేటలు నాకును గలవు. కాని ఏమి ప్రయోజనము? నోటికి వచ్చినట్లెల్ల మాటలాడకుము.

సూర—(కోపముతో) నీవా నేనా నోటికి వచ్చినట్లు మాటలాడినది? అంతరోషము గలవాడవు నాడబ్బిచ్చి కదలుము. చిల్లరచిల్లరగా నిచ్చినచో నొప్పుకొనను? అంతయు నొక్కసారి యీయవలెను. ఒక్కసారిగ దీసికొనినపుడు ఒక్కసారిగనే యీయవలెను. అసుగు కదలనీయను. (సమీపించి) ఇచ్చి మరి కదలుము.

ఉమా—(శాంతముగ) నీవు నన్ను చూచి డబ్బియలేదు. నాఆస్తినిచూచి యొసఁగితివి. నన్నిచట నిలిపిన నేమి లాభము?

సూర—భేష్. మంచిమాట చెప్పితివి. అంతియేనా! నడువుము. నాచేతనైన నాడబ్బు వచ్చు నుపాయము చేసికొందును. లేనిచో...

ఉమా—మాటలు మిగలకుము. నీయిచ్చవచ్చినట్లుచేయుము

ఇట్లు పలికి ఉమాపతి యింటికి వచ్చెను. ఏలూరులో సుందరరావుగారును, వసంతవాడలో సూరయ్యయు నాతనికి భయహేతువులైరి. ఇంటికడ నిలువక ఉమాపతి సత్యమూర్తి యింటికేగెను. అతఁడింటలేడు. త్రోవలో వెంకయ్యగారు కని

పించిరి. ఉమాపతి యాయనతో సూరయ్యాకును దనకును జరిగిన సంభాషణను జెప్పెను. ఆయన ముక్కుపై వ్రేలిడుకొనెను. "ఉమ్మయ్యా! సూరయ్యయు, సత్యమూర్తియు నీపాలిటి శత్రువులుసుమా! వారెంతచేయుటకైనను వెఱువరు. నీవెట్లు మెలఁగెదవో! అమాయకుఁడవు." అని పలికెను.

వెంకయ్యాగారి మాటలు దేవత పలికినట్లుండెను. ఆ సమయమున నుమాపతి మనస్సుకామాటలు నిజములే యనిపించెను. వెంకయ్యతాతా! నీమాటలు నిజమేయని నా యంతస్సు చెప్పుచున్నదయ్యా! ఇపుడేమి చేయుమందువు? అనెను.

వెంక—ఉమ్మయ్యా! నేను నీకు సలహా చెప్పలేనయ్యా! నాకు ఆయిద్దరి సంగతులును దెలియును గనుక చెప్పితిని. ఈ యాపద నెట్లు తప్పించుకొందువో. ఉచ్చులోఁ దగుల్కొంటివేమయ్యా పిచ్చివాడా! ఇట్లనుచున్నానని బెంగపెట్టుకొనకుము. ధైర్యమును మాత్రము వీడకుము. సగమునకు సగము తగ్గితివి. మఱచితిని. ఏలూరులో మామయ్యాంకుడు నీ వేగినపుడు నిన్ను దుర్భాషలాడెనఁటగా నిజముగునా!

ఉమా—ఇట్లని నీతో నెవరు చెప్పిరి!

వెంక—ఎవరును జెప్పలేదు. ఊరంతయుఁ జెప్పుకొనుచున్నారు ఆయనయును డబ్బుగలవాడేనఁటగదా! పోనీ సర్దుబాటు

చేయునేమో కనుగొనలేకపోతివా బాబూ! ఏమిచేసియైనను ఈ పీడ వదలించుకొనుము నాయనా!

ఉమా.—అట్లే తాతా! ప్రయత్నము చేసెదను. ఇఁక పోయి వచ్చెదను.

వెంక.—సరే! వెళ్ళిరమ్మ.

వెంకయ్యగారు ఎంతమంచివాఁడు! తానెప్పుడో చేసిన కొద్ది యుపకారమునకే ఎంత మనసిచ్చి మాటలాడినాఁడు. ఒక్కొక్కప్పుడు ఒకరినిచూచిన నొకరికి అవ్యాజానురాగము జనించును. ఆ యనురాగము ప్రతిఫలము నపేక్షింపదు. అది కల్మషరహితమై పవిత్రతను గుమ్మరించును. మఱియొకప్పు డొకరిని చూచిన నకారణముగఁ గోపము జనించును. ఏహ్యభావము గలుగును. కారణము దురూహ్యము. ఈ రెండింటికిని ఏదో పూర్వజన్మ కారణము లుండునేమో! వయసుమీరిన కొలఁదియు మనుజులలో నుత్తమభావములు పొడసూపునని కొందఱందురు. అదియే నిజమైనచో నూరయ్యకు నఱువదిదాటినవికదా అతనికేల అట్టిభావములు కలుగవు? మఱికొంతమంది మంచిచెడ్డలు పుట్టుకతో పూర్వజన్మ పుణ్యాపాపముల ననుసరించివచ్చునేకాని ఒకరుబోధించిన గలుగవందురు. ఇది నిజమేయగునేమో! ఏమైనను వెంకయ్యగారిలో నున్నతత్వము గూడుకట్టుకొనినదనుట మాత్రము నిజము.

సుందరరావుగా రే లూరులోనన్ను దూషించుట నే నెవరితోడను జెప్ప లేదుకదా వసంతవాడలో నెల్లరకెట్లు తెలిసినది ? ఇదినాయుహ కందరానిదిగ నున్నది. పద్మిని సినిమాలకు వెళ్లుటయు, ఇంటిది ఏలూరులో దనపుట్టినింటికి వెళ్లుటయు నెట్లు సుందరరావుగారికి తెలిసెనో ఇదియునట్లే వసంతవాడలో దెలిసెను. ఈ విషయము లిటు ఎవరివలన బహిర్గతములగు చున్నవి ? అందఱనుకొనినట్లు సత్యమూర్తి ఇట్టిపనులుచేయుట లేదుకదా ! సరిగ దెలియక ఏ దోషమును నెవరిపైనను మోపరాదు.

ఇట్లు తలచుచు బజారునుండి ఉమాపతిఇంటి కే తెంచు చుండెను. తలయెత్తిన యుమాపతికి సత్యమూర్తి నూరయ్యా వీథినుండి వచ్చుచుండుట కానన య్యెను. మఱల తలవంచి ఉమాపతి ఇంటికివచ్చెను.

---

## ౬

ఆంధ్రులు బహుప్రాచీనకాలమునుండియు నున్నట్లనే కాధారములున్నవి. వారుత్తమశీలసంపదగలవారు. ఉద్వేగముతోఁ గూడిన మనస్సుగలవారు. పరోపకార మొనర్చు పట్టుల స్వార్థమును గూడ గణింపని యావేశపూరితులు. ఎదిరించినవారిని చీరికిఁగొనరు. దాసోహమనినవారిపై సిగ

స్త్రవాలనీయరు. అనుపమానమైన మేధాసంపత్తిగలవారు. ప్రజల గన్నబిడ్డలవలెఁ బరిపాలించినవారు. అట్లు పాలించిన మూఁడవవారిలో విష్ణువర్ధన మహారాజొకఁడు. ఆయన వసంత వాడను రాజధానీ నగరముగఁ జేసికొని యాప్రాంత ప్రదేశ మంతయు బరిపాలనచేసెను. ఈ విషయమాగ్రామమున దొరకిన శాసనముల మూలమున వెల్లడియయ్యెను. విష్ణువర్ధనుఁ డుదారగుణములుగలవాఁడు. గ్రహణసమయమున నాగ్రామ మమందలి సుక్షేత్రమును భూసురులకును దానముచేసెను. భూమికిగల హద్దులందుఁ బేర్కొనఁ బడినవిగాని నేఁడవిగుర్తిం చుటకు వీలులేదు. వసంతవాడబహుప్రాచీన కాలమునుండియు నున్నదనుట కాయూరఁగలపాటి దిబ్బలే తార్కాణము కావచ్చును. అందున్న యొకశివాలయము సుగ్రీవునిచేఁ బ్రతిష్ఠింప బడినదని పరంపరాగతమైన యొక కథనము గలదు. అందు మూఁడు చెఱువులుగలవు. అందొకటి పేరంటాలచెఱువు. దీని కానామముండుటకొక కథను చెప్పెదరు. గ్రామమునకుఁ బశ్చిమముగ 'గంగానమ్మ' గుడిగలదు. ఈ దేవత మిగుల సత్యము గలది. గ్రామస్థులతో నామెయవసరము వచ్చినపుడదృశ్యమై మాటలాడుచుండెడిదఁట! ఒకకొంటెచేసిన పరాభవమునకామె కోపించిచిక్షుద్రులైన మానవులతో సంభాషణతగదని మానుకొనెనఁట ! ఈ కథయు నాగ్రామమందలి కోవిదులచే నేటికిని చెప్పబడుచునే యున్నది.

గ్రామమందలి బ్రాహ్మణులు వేదములయందును, శాస్త్రములయందును గడుసమర్థతగలిగి యుండెడివారు. గ్రామములోని సర్వవర్ణములవారును నొకేజాతియను భావముతో మెలగుచుండెడివారు. కక్షలు లేవు. కలతలు లేవు. గ్రామమంతయు నొక కుటుంబమువలె నుండెడిది. ఎన్నడైన యరిషడ్వర్గముఁ దలచూపిన వారి నా గ్రామమందలి పెద్దలు పిలిపించి చక్కదిద్ది పంపెడివారు.

ఆ తరువాత కొంతకాలము నకది జమీందారీ గ్రామమగుట సంభవించెను. అపుడాయూరికి జమీందారులు వచ్చి యప్పుడప్పుడు మకాము వేయుచుండెడివారు. వారు వచ్చుట యనగా వేఱొక గ్రామమెత్తి వచ్చుట. వారితోపాటు క్రూరమృగములగు పులులు, సివంగులు మొదలగునవి కొనిరాబడెడివి. ఏనుగులును లొట్టిపిట్టలును వారిరాకకు పూర్వమే వచ్చెడివి. గుఱ్ఱములు పలురకములైనవి వారికి వాహనములుగ నుపయోగపడుచుండెడివి. బాలబాలికలకా ప్రభువులు వచ్చుట ఒకపండుగవచ్చుటవలె నుండెడిది. ఆకలి దప్పులుండెడివి కావు. మృగములను జూచుచు, జమీందారుల ఉద్యోగస్థుల నడిగి కాగితములు, సిరా మొదలగు పరికరములఁ తెచ్చుకొనుచుండెడివారు. ప్రజల క్షేమాదికము నారసి వారు వసంతవాడకుఁ దూర్పున నుండెడి చిన్నయడవిలో వేఁటాడి,

కొన్నిదినములైన పిదపఁ బోవుచుండెడివారు. ఆ దినములు మిగుల నానందముగ నుండెడివి.

క్రమముగ నాగరకత బలిసి కోర్టులకు బోవుటకు ప్రజలు మొదలు పెట్టిరి. వారిని కోర్టుల కెక్కించుటకు సత్యమూర్తి మిగుల గష్టపడెను! దానివలన నాతనికి చేయితడి యగుచుండెను. సూరయ్యగారి వ్యవహారములలో జోక్యము కలిగించుకొనుటతో నాతఁడొక గౌరవము కలవానివలె మెలఁగెను. కొందఱకాతఁడు చేయుచున్న పనులు బాధను గలిగించెను. కాని సూరయ్యగారాతని కండగ నుండుటచేతను, ఉమాపతి మంచితనము చేతను వారాబాధను మనస్సులోననే నిముడ్చుకొనిరి.

ఒకనాఁ డుమాపతి భజగోవింద శ్లోకములు పఠించుచు లోపలి యరుగుపైఁ గూర్చుండియుండెను. ఇంకను దెల్లవారలేదు. మసక మసక చీకటి వ్యాపించియుండెను. ఉమాపతి కాలకృత్యములు దీర్చుకొనుటకై వెడలివచ్చుటచే వాకిట తలుపులు దెఱచియుండెను. దాశరథిశతకమందలి పద్యములను క్రమముగ నుమాపతి గానము చేయుచుండెను. ఇంతలో నలుగురు వాకిలితలుపు దెఱచి లోనికిఁ బ్రవేశించిరి. ఉమాపతిగారున్నారా? యని యొక వ్యక్తి ప్రశ్నించెను. 'ఆఁ నే, నిక్కడనే యున్నానని యుమాపతి బదులుచెప్పెను. ఆ వచ్చినవారిలో మునసబు భూషయ్యయు, సూరయయ్యు

గూడ నుండిరి. ఉమాపతి భూషయ్యతో 'మామా ఏమి పనిమీదనయ్యా యిప్పుడువచ్చితివ'ని ప్రశ్నించెను. భూషయ్య మాటాడ లేదు. ఉమాపతి వారిని గూరుచుండుడని చిఱుచాప వేసెను. అందఱును గూరుచుండిరి. వచ్చినవారిలో నిద్దరు నూతన వ్యక్తులుండిరి. వారిలో నొకడు 'అయ్యా! తమ పొలములోనున్న ధాన్యపుఁగుప్ప లన్నియు సూరయ్యగారు జప్తుచేయించిరి. తాము కోర్టువారిచే విడిపించుకొనిననేతప్ప వానిని నూర్చుట కవకాశము లేదు. జప్తుచేసిన ట్లూరిలో టముకు వేయింపవలెను. అక్కఱ లేకన్న నూరుకొందును. మీ రీ కాగితముపై సంతకము చేయుడు. మునసబుగారు సాక్షి సంతకము చేతురు. అని పలికెను. ఉమాపతి యీ మాటలు విని నిర్విణ్ణుడయ్యెను. నోట మాట రాలేదు. భూషయ్య యాతని దైన్యావస్థను జూచెను. 'ఉమ్మయ్యా! అందఱమును మనుష్యులమే. కష్టము లొకరికే రావు. నీ యోగ్యతకు, మీ వంశ మర్యాదకు నీకీ కష్టము రాగూడదు. ఇది యెందులకు వచ్చినదో! చేయుము. సంతకము చేయుము. ఆపైన నేనుజేతు'నసెను. ఉమాపతి అమీనానుండి కాగితమును దీసికొనెను. ఆవెలుగులో నాతడు గుర్తించిన ప్రదేశమున నుమాపతి సంతకముచేసెను.ఆపైన భూషయ్యచేవ్రాలుచేసెను. ఒకింతసేపు ఎల్లరును నిశ్శబ్దముగ నుండిరి. ఉమాపతి గొంతు పెకల్చుకొని 'భూషయ్యమామా! అన్ని పొలములలోనున్న

కుప్పలును జప్తు ఐనట్లేనా? యని ప్రశ్నించెను. భూషయ్య సూరయ్యవంక చూచెను. సూరయ్యఁ ఒకటియును విడిచిపెట్ట బడలేదని'పలికెను. భూషయ్య ఆమాట వినుటతోడనే ఒకవిధ ముగ మారెను. ఉమాపతి దిక్కు చూచెను. ఉమాపతిశిరస్సు వంగియుండెను. అప్పటికి వెలుతురు బాగుగవచ్చెను. వచ్చిన వారిలోనాలుగవ వ్యక్తి రక్షకభటుఁడని తెలిసెను. భూషయ్య అదినాతో మీపనియైనదికదా! వెడలిపొండు. అనెను. అంతతో నాయన యూరకొనలేకపోయెను. కోపము లోపల నుండలేకపోయెను. వెంటనే యాతఁడు బిగ్గరగా "సూరయ్యా! నీకోరిక నెరవేరినది గదా! ఇఁక దయచేయుము. మనుజుడు జన్మమెత్తగనే సరికాదు. ఆతఁడు మనుజుడు కావలెను. ఎంత మంది కొంపలు తీయఁదలఁచితివి? అంతయుఁ బ్రోగుచేసి ఎవ రికి పెట్టెదవు? తినుటకు నీకు మగనలుసైన లేదుకదా! ఈ ఆస్తియంతయు నెవరికిఁ గట్టిపెట్టెదవు? చనిపోవునప్పుడుకూడ తీసికొనిపోలేవు. దేవునివంటి ఉమాపతినిఁగూడ నీ ద్రోహము నకు బలిచేసితివి. ఇక సామాన్యులు నీకడ నాగుదురా? ఏ మొగము పెట్టుకొని యూరిలోఁ దలయెత్తుకొని తిరిగెదవు? ఛీ! నీమొగముఁజూచిన పాపముఁవచ్చును"అనెను. సూరయ్య ఆమాటలకుఁ గోపోద్రిక్తుఁడయ్యెను. 'భూషయ్యా! నీవు మున సబువని నేనూరుకొనను. డబ్బుతీసికొనిన వారీయనక్కరలేదా తీసికొనునపుడు మీరెవ్వరైన నెఱుగుదురా? ఇచ్చునపుడింత

యార్భాటము కావలసివచ్చెనా? నిజమాడిన నిష్ఠురము. ఆ మేకవన్నెపులికి నీవు సహాయమా? మొన్న నన్నెన్ని దుర్భాషలాడెనో మీకుఁ దెలియదు! ఇఁకచాలునూరకొనుము, అని గద్దించెను. ఉమాపతి వారిరువుర నడుమకువచ్చి గద్గద స్వరముతోఁ భూషయ్యమామా! నీవూరకుండుము. అంతయు భగవంతుని యధీనము. సూరయ్యగారు చేసినదే యుక్తము. నేను వారి డబ్బిచ్చినచో నిట్లు చేయనవసర ముండెడిదికాదు గదా! పోనిండు. ఐనదానికి పోట్లాడవలదు' అని సర్దిచెప్పెను. అంత భూషయ్య—

సూరయ్యా! నీకడ నుమాపతి పైకము పుచ్చుకొను నపుడు భూముల ధరలెట్లున్నవి? యావరుసను లెక్కగట్టి భూములను దీసికొనుము. అది పెద్దమనుష్యులలక్షణము. భగవంతుడు మెచ్చునట్టిపని గాదా, కాలముసవ్యముగవచ్చు నంతవఱకోపిక పట్టుము' అనెను.

సూరయ్య—శ్రీరంగనీతులు నాకడఁ జెప్పకుము. లేనిపోని పెద్దరికముఁ బైనబెట్టుకొని ఏల ఇట్లు వాగెదవు?

భూష—ఏమంటివి? వాగుచుంటినా? నోరు మూయుము. నోటికి బుద్ధి చెప్పించెదను.

సూర—ఆ - నీ ప్రయోజకత్వము నాకుఁ దెలియనిదికాదు.

ఇట్లు వారు వాదులాడుకొనుచుండగా నూరందఱును నచ్చుటకు వచ్చిరి. అందఱును సూరయ్యను నిందించెడివారే

వెంకయ్యవచ్చి సూరయ్యను దిరిగి చీవాట్లుపెట్టెను. అతఁడు ఏమన్ననుదనవాదమును మానలేదు. అయినా తనపనిముగించుకొని రక్షక భటునితోఁ గూడ వెడలిపోయెను. ఊరంతయు నొక్కసారిగ నీవార్తను దెలిసికొనెను. ఎల్లరును దమకే ఆయాపద తటస్థించినట్లు వాపోయిరి. భూమయ్య, వెంకయ్యలు మాపతికి ధైర్యముచెప్పి వెడలిపోయిరి. ఒకరొకరే ఎవరియిండ్లకు వారుపోయిరి.

ఉమాపతి లోనికివచ్చి మంచముపై పరుండెను. రాధమ్మయు, పద్మినియు నాతనికడకువచ్చిరి. పద్మిని తండ్రినిఁ జూచి చకితయయ్యెను. తండ్రి ధైర్యమును గోలుపోయెనని తెలిసికొనెను. ఆయనను జూడగనే యామెకు దుఃఖము సముద్రమువలె పొంగివచ్చుచుండెను. ప్రయత్నముచేసి దుఃఖమును దిగమ్రింగెను. తండ్రినిఁ జూచి "నాయనా! నీవే యిట్లయిన మేమేమి కావలెను? నీవు ధైర్యము వహించిన మేమును ధైర్యముతో నుందుము. ఏమిచేయఁదలఁచినను నా భగవంతుఁడే చేయవలెను. లెమ్ము. లేచి స్నానముచేయుమనిపలికెను. రాధమ్మ పైటచెఱఁగుతోఁ గన్నుల నద్దుకొనుచు, లెండు. పిల్లలిద్దఱును బెగులెత్తి చూచుచున్నార"ని పలికెను.

ఉమాపతి లేచి చిన్న కుమారునితో "నాయనా! ఈ పదిరూపాయలును దక్షిణపువీథినున్న నరసయ్యకు మా

నాయన యొసంగెనని యిచ్చిరమ్ము. వచ్చుచు దారిలో మన సత్యమూర్తి బాబాయిగారింటి కేగి బాబాయిని నేను వెంటనే రమ్మని పిలుచుచున్నానని చెప్పి తీసికొనిరమ్మని" చెప్పి పంపెను.

ఉమాపతికి తన కన్నులయెదుట జరుగుచున్న దృశ్యములు ఒకటొకటే తలఁచినపుడెల్ల నాశ్చర్యమును గలిగింప సాగెను. రెండు దినముల క్రింద తాను సూరయ్యతోఁ జేసిన సంభాషణ యాతనికి కష్టము గలిగించెనేమో యనియు దాని పర్యవసానమే నేఁటి పొలములలోని పైరు జప్తు అగుటకు కారణమై యుండుననియు నూహించెను. తన మనస్సు ఎంతగఁ జిక్కఁబట్టినను ధైర్యముగ నుండుటలేదు. మూఁడువందల ఎకరములలోని ధాన్యలక్ష్మి యింటికి రాకుండఁగ బోవుటయనిన సామాన్యమా! క్షేత్రమునే నమ్మియుండు రైతు పడు వేదన వర్ణించుట కలవికాదు. సంవత్సరమంతయుఁ గష్టించి దున్ని, నాటి, కృషిచేసిన ఫలము నోఁటికడకువచ్చి వెనుకకుపోయెను. అది ఎవరి మనస్సును గష్టపెట్టదు? సత్యమూర్తికైపోయిన యుమాపతిపుత్రుఁడు పఱుగెత్తికొని వచ్చి నాయనా! బాబయ్య బెజవాడ వెళ్లెనఁట యని చెప్పెను. ఉమాపతి యా వాక్యములను శ్రద్ధగా వినెను.

---

౭

ఇరుగు పొరుగువారు తీర్థయాత్రలకు బయలు దేఱు చుండగ వారితో సుమాపతి తల్లి పున్నమ్మ మూఁడు మాసముల క్రిందట పుణ్యక్షేత్ర సందర్శనమున కేగినది. క్రమముగ వారు రామేశ్వరము, పెద్దతిరుపతి, కంచి, కాళహస్తి మొదలగు పుణ్యక్షేత్రములను సందర్శించిరి; ఇంకను దక్షిణాదినున్న బహుక్షేత్రములవారు సందర్శించుటకుఁ బూనుకొనిరి. ఒక క్షేత్రము తరువాత నింకొక క్షేత్రమును దర్శించు చున్నకొలఁదియు వారెల్లరును భక్తి పరవశు లగుచుండిరి.

దివ్యక్షేత్ర సందర్శనముఁ జేయుటలో ననేకమంది కనేకాభిప్రాయము లుండును. కళాప్రియులగువారు కేవలము భక్తి భావమునకే ప్రాధాన్యమీయరు. ఆ గోపురముల నిర్మాణము, వానిపై నున్న శిల్పరచన, కట్టడములతీరు, ఇవియన్నియు వారి మనసున హత్తుకొనును. మఱికొందఱు కేవలమా యా క్షేత్రములలో గల భగవంతుని దర్శనము చేసికొని అపగత పాపులమైతిమని సంతసింతురు. దేవుఁడు సర్వవ్యాపిగదా! ఐనపుడు కాళహస్తి చూచిననే పుణ్యము గలుగుట యేల? ఇచటనే యూరనున్న శివలింగమును గాంచినను బుణ్యము గలుగునని యొకరకమువారి వాదన, కాదు, క్షేత్రమాహాత్మ్యము లుండును. కావుననే ఈ పుణ్యక్షేత్రముల సందర్శనమని

వారికి గొందరి సమాధానము. క్షేత్రమాహాత్మ్యము లున్నను భ క్తిభావమే మిగుల ప్రధానమైనదని భాగవతోత్తముల సిద్ధాంతము. ఇట్లు ఏ విషయముపైనైనను దెలివితేటలు గలవారు సిద్ధాంతరాద్ధాంతములు చేసెదరు.

పూర్వకాలమునఁ బుణ్యక్షేత్రములకుఁ బోవుట కనుకూల మార్గములు లుండెడివి కావు. ఇతరసౌకర్యము లేవియును లేవు. ఎంతదూరము పోయి ఎన్ని క్షేత్రములు సందర్శింపవలెనన్నను కేవలము నడచియే పోవలెను. మహారాజులకుఁ గోటీశ్వరులకును వాహన సౌకర్యము లుండిన నుండి యుండవచ్చును. అట్టివి సర్వేసర్వత్ర లభ్యముకావు. కనుక పెక్కుమంది కాలి నడకనే పోవలసియుండెను. అపోవునపుడు పెక్కుగ్రామములు, పట్టణములు, నదులు, ఇవియవియననేల మనుజుని సృష్టి మొదలు భగవంతుని దివ్యశిల్పమువరకును అన్నియు సందర్శించుటకు వీలగును. ఒకగ్రామములో నొక భక్తుఁడిట్టి యాత్రలు సలుపువారికై సత్రములు గట్టించి యాతాయాత జనులకింత యాతిథ్య మొసఁగును. ఆగ్రామమందే మఱియొక డట్టి సత్రములలో దిగినవా రేమరుపాటుననుండ వస్తువుల దొంగిలించుటకుఁ బెద్దమనుష్యునివలె వారిని వెన్నంటును. ఒక గ్రామమందలి జనులు వీరినిఁ జూచియుఁ జూడనట్లూరకుందురు. వేఱొక గ్రామమందు వీరిని సభక్తికముగఁ దోడ్కొని పోయి యాతిథ్యమిత్తురు. ఒకయింట భర్త భక్తబృందమును

దనయింటికి భోజనమునకు బిలువగా వారికి వండిపెట్టుటకుఁ దనకు శక్తిలేదని భార్య ప్రతివచనము చెప్పును. మఱియొక యింట భర్తకుఁ దెలియకుండఁగ భార్య భర్తశిఖామణుల దన యింటికాహ్వానించి యిట్లు చేసితినని యాయనకు దెల్పగా వారికందఱకును దగిన సామగ్రి తెచ్చిపెట్టుటకు నాదగ్గర పైక ములేదనియు,నాకుఁ దెలియకుండఁగ నేలఆహ్వానించితివనియు నాత డామెను కసరును. ఎవరైన నీపూటఁ దనయింట నాతిథ్యము తీసికొనుటకు వత్తురో లేదోయని యొకయా స్తికుఁ డెదురు చూచుచుండును. దనయింటి కెవరైన నన్నము పెట్ట మని వత్తురేమోయని యొకఁడు తలుపులు మూసివేసికొనును.

ఇట్లు భిన్నభిన్నభావములు, మానసిక ప్రవృత్తులు గల వారనేకులు తీర్థయాత్రలకుఁబోవునపుడు గాన్పింతురు. అట్లు వారినిఁ జూచుటలోకజ్ఞాన మలవరచుకొనుట. కొంత ద్వేగు చున్నకొలఁదియు నాచార వ్యవహారములలోఁ గావలసినంత మార్పు గోచరించుచుండును. ఆచారములనఁగాఁ బ్రజలచే పరంపరగా నాచరింపబడుచు వచ్చుచున్నఅలవాట్లు. దేశకాల ముల ననుసరించి యీ యలవాట్లు మారుచుండును. స్నానము చేసి ఆరవేసిన వస్త్రమును ధరించిననేకాని యిచట దేవతా పూజకును పవిత్రతకును బనికిరాదు. దక్షిణదేశమున ఎన్నిదిన ములక్రిందఁగట్టిన వస్త్రమైనను విడువకున్నది మడిగనే చెల్లు బడియగును. మనవారు వెనుకముందు బిళ్ళగోచీలతో వస్త్ర

ములు ధరింతురు. అచట గూడకట్టు కట్టుదురు. ఇట్లనేకములు భిన్నభిన్నములుగఁ గన్పించును. ఇవి యన్నియు లోకవృత్త మెఱుంగుట కవకాశ మొసంగును. కావుననే పూర్వము నడచియే తీర్థయాత్రలకు వెళ్ళవలెనను నియమ మేర్పరుప బడినది. నేఁడది ప్రయాణసౌకర్యములు మిన్నగ నుండుటచే సడలింపఁబడినది.

పున్నమ్మగారు దక్షిణదేశయాత్రలు చేయుచు విశేషానుభవము గడించుకొనుచుండిరి. ఎన్ని దినముల నుండియో తీర్థయాత్రలు చేయవలెనను సంకల్ప మామెలో కదలుచుండెను. అట్టిది నేటికి సమకూడెనని యామె యానంద పరవశురాలగుచుండెను. ఒకింత వయసు మీరినదగుటచే నపుడామెను గనిపెట్టి చూడవలసినభారముకూడ నున్నవారిపై బడుచుండెను.

ఒకనాఁడామె కుమారుఁడగు నుమాపతికిఁ దనకడనున్న పైకమంతయు ఖర్చగుచున్నదనియు నింకను జూడవలసినదివ్య క్షేత్రము లనేకములున్నవనియు వానినిఁ జూచివచ్చుటకును ఖర్చులకును రెండువందల రూపాయలను వెంటనే బంపవలనది దిగ నుత్తరము వ్రాయించెను. ఉమాపతి యా యుత్తరమును జదువుకొని కూలబడెను. తల్లిని తీర్థయాత్రలు మానుకొని వెంటనే రావలసిదని యెట్లు వ్రాయగలఁడు ? పైకమెట్లుపంపఁ గలడు. ఒకదానిపై నింకొక సమస్య వచ్చిపడుచుండెను.

ఉత్తరముఁ జూచుటతోడనే యాతనికి నవ్వువచ్చెను. వరుసగా నన్నుఁ బరీక్షచేయుట కిట్టి సంఘటనలు వచ్చుట చూడ మనుష్య ప్రయత్నము కాదని యాతఁడు లోనఁదలఁచెను. నూరయ్య, సుందరరావు, సత్యమూర్తులు తన్నుఁ గష్టపెట్టుచున్నారనుట కల్ల. కష్టమైనను సుఖమైనను మనమనుభవింపవలసి యున్నపుడు భగవంతుడే ఆయాయి మనుజులలో సంకల్పరూపమునఁ జేరి తత్తదను రూపములయిన యనుభవములను గూర్చుచుండును. మనుజులందఱును నాతని సృష్టియే కాన నాతఁడు వారిచే వారికి, వారివారికర్మల ననుసరించి యనుభవములను గల్పింపఁజేయుచుండును. ఒకడు విరోధి యనియు వేఱొకఁడు హితుఁడనియు ననుకొనుట యల్పత్వమువలననే! కనుకనే యొకఁడు అకారణబంధువయి యొకరి కష్టసుఖములలోఁ బాలు పంచుకొనుచున్నాఁడు. వేఱొకఁడు అకారణముగనే వారికి శత్రువగుచున్నాడు. ఇపుడు భగవంతుఁడు నన్నుఁ బరీక్షించుచున్నాడు. నాకిపుడఱువది దాటినవి. కలియుగమున నాయాయువు చెల్లినట్లే. నామనస్సునంత శ్శత్రువులకుఁ దావులేకుండ చేసికొనవలెను. ఎంతకాల మీసంసారమిట్లు గడపుచున్నను నింతియే. ఐహికములగు భార్యా పుత్రాదిబంధములన్నియు మనుష్యకల్పితములు. వాని వీడకయే, సంబంధములేని యట్లు మెలగనేర్చుటనీతి. ఉత్తమాదర్శములు, ఉత్తమధర్మములు ననుష్ఠించుట యిహపరసాధ

కము. ఇట్టిభావములు నామనసునకు బలుమారులు వచ్చు చునేయున్నవి. కాని నిలుచుటలేదు. తెలిసియో తెలియకయో గలిగించుకొనిన భార్యాపుత్రాది బంధము నొక్కసారిగఁ ద్రెంచుటకుఁ దగిన మనోదార్ఢ్యము కానవచ్చుటలేదు. ఇంత తెలిసియు నామనస్సునకు సుందరరావును, సూరయ్యయును భయకారణమగుచున్నారు. వారును మనుజులేకదా! నే నేల వారనిన భయపడవలెను? నాలోఁదప్పున్నదన్న మాట. ఆతప్పును సరిచేసికొనుట యనఁగా వారికీయవలసిన ధన మిచ్చుట. ఇది యిట్లుండ నమ్మగారికిపుడు రెండువందలెట్లు పంపింతును? పంపకపోయిన నామె యేమికావలెను? కనుక పంపియే తీరవలెను. ఎట్లు? ఇటులాతఁడు గదిలో మంచముపై పరుండి యూహాపరంపరలలో మైమఱచియుండెను. అచటకు రాధమ్మ వచ్చెను. అతడామెను జూచి ఉలికిపడెను. ఆమె "ఎవరనుకొంటిరి? అట్టులికి పడితి"రనెను. "ఉమాపతి నీవా! ఎవరో యనుకొంటిన"నెను. ఎవరో యనగ? అని రాధమ్మ ప్రశ్నించెను. "సూరయ్యయనుకొంటి" నని ఉమాపతి బదులు చెప్పెను. సూరయ్య గదిలోని కేలవచ్చును? లెండు. స్నానము చేయుడు. ఆపైన భోజనము చేయవచ్చును. ఏదియో ఆలో చించుచున్నట్లున్నారే? యని రాధమ్మ యనెను.

ఉమా—మా అమ్మగారు ఉత్తరము వ్రాయించినది.

రాధ—ఇంటి కెప్పుడువత్తురు?

ఉమా—ఎప్పుడువత్తురో తెలియదు. ఇంకను కొన్నిదినములు దక్షిణదేశసంచారము చేసినపిమ్మటఁగాని రారఁట.

రాధ—అటులనా?

ఉమా—ఆమె వచ్చుటకును, యాత్రకును మఱలరెండువందల రూపాయలుపంపవలసినదిగను త్తరములోనున్నది.

రాధ—(ఆలోచనతో) ఇపుడేమిచేతురు?

ఉమా—ఏమిచేయమందువు?

రాధ—నా మెడలో నీ గొలుసొక్కటిమాత్రమే మిగిలి యున్నది. దీనిని ఏలూరుతీసికొనివెళ్ళి యమ్మి యత్తగారి కా పైకమంపుడు.

ఉమా—(లేచి) మంచి యుపాయము చెప్పితివి. ఏలూరు నేను వెళ్ళను. సుందరరావుగారు కనిపించవచ్చును. ఆయన పైకము నెలదినములలో నీయవలయునని మొన్ననే చెప్పెను. నీ వేగి మీ యన్నచే నీ గొలుసునమ్మించి ఇదిగో ఈ కార్డులోనున్న చిరునామాకు పైక మంపు నట్లు చేయుము.

రాధ—సరియే భోజనముచేసి కాగుమీాద పాలేరును దీసికొని ఏలూరుపోయి వచ్చెదను. ఆలసింపక స్నానమునకులెండు. నేను వడ్డించుటకు పోవుచున్నాను.

ఉమాపతి రాధమ్మ మహాపతివ్రతయని మనసులో నానందించెను. "ఇది మిగుల క్లిష్టమైన సమస్య. ఈ సమస్య

ఎట్లుతీరునాయని భయపడితిని. అనుకొనినంత సేపు పట్టలేదు. అబ్బ ! నా మనసీ నిముసమున నెంత తేలికగనున్నది. సర్వ మును నిట్టులే చక్కబడిన నెంత బాగుండును ! ఏమి నాపిచ్చి యూహ. నాప్రాణములో ప్రాణము. అర్ధాంగి యగుటచే జీవితాంతమువఱకును స్వేచ్ఛగ దనకడనుంచుకొని ఇచ్చవచ్చి నట్లు చేయుటకు హక్కుగల నగలను నాకై ఏ సంకోచమును లేక వ్యయపెట్టినది. అమాయకురాలు. కాపురమునకు వచ్చి నది మొదలు ఒకసారియైనను నామాట కెదురాడలేదు. నా యాజ్ఞ ప్రభునాజ్ఞగ శిరసావహించినది ! ఆమెకుఁ గష్టసమయ ములో నడ్డుపడుటకును సౌందర్యవృద్ధికిని నేర్పాటు కావింపఁ బడిన యీనగలు నేఁ దీసికొనుట కూడనిపనియేమో ! సూర వ్యకు వడ్డిచెల్లించుటకుఁ దొలుతనే యున్నినగలును దీసి కొంటిని. ఇపుడీ రెూక్కటియుఁ దీసికొనుచున్నాను. నోరులేని యీమెకు నేనై చేయించిన నగరెూక్కటియును లేదు. ఆమె తండ్రి, రెూక్కతెయే పుత్రికయగుటచే వీనినిఁ జేయించినాఁడు. అవి నాకిపుడుపయోగపడుచున్నవి ! నిజమునకు నాకు వీనిపై నెట్టిహక్కును లేదు. నేనేల యీధైర్యము చేయవలెను ? ఇది యన్యాయమగునేమో ! ఎన్ని అన్యాయ కార్యములు చేయక నేనీబాధ ననుభవించుచున్నాను ! అమ్మగారికి పైకము పంప బడును. ఆమెవచ్చును. కృష్ణమూర్తికెట్లు డబ్బుసర్దుబాటగును ? సుందరరావుగారి సొమ్మెట్లిత్తును ! సూరయ్యబాకీ తీరుటఎట్లు ?

ధాన్యమంతయు సూరయ్యస్వాధీనమైన నీ సంవత్సరము జీవిం
చు నుపాయమేది? వ్యవసాయము మఱల సాగించుటకుఁ
జేతిలో చిల్లిగవ్వ లేదుకదా! హరి హరీ! నేనీ విపత్సముద్రము
నుండి బయటపడు నుపాయము లేదు. పొరపాటున భూముల
యందలి వ్యామోహముచే నేఁజేసిన పని కిన్ని యిక్కట్టులు
వచ్చినవి. వ్యవసాయము చేయించుటలో, న్యాయమార్గానుసరణ
ములో పొదుపులో నీయంతవాఁడు లేడని జనులనినపుడు నిజమే
యనుకొంటిని. ఇపుడు నీయంత మూర్ఖుఁడు లేడు. పెద్దగ
బ్రతికిన సంసారము రేపటినుండియు నేమి కావలెను?
మా సంసారమేమైన కానిమ్ము. ముక్కుపచ్చలారనిది
భర్తతో సుఖముగ గాపురముచేయుచు నత్తయింట నుండ
వలసినది. పుత్రిక కాపురమునకుఁగూడ నీళ్లుదోడుచుంటినా?
సుందరరావుగారెంత కఠినుఁడు! కుమారునకు రెండవపెండ్లి
చేయునఁట! ఆమాటఁగూడఁ దలఁచుటకు మనసొప్పుటలేదు.
ఇంటికి వెడలినపుడు మంచినీళ్లు కావలెనాయనియైనను నడుగ
లేదు. కుమారునకు రెండవపెండ్లి చేయఁదలచుకొన్న వాఁడెట్లు
డుగును? ఏలూరున వియ్యాలవారాడిన మాటలు పద్మిని విన్న
నేమగును? తలఁచుకొను కొలందియు నాహృదయము సము
ద్రమువలె సంక్షోభముఁ జెందుచున్నది." ఇట్లుమాపతి యంతు
లేని యాలోచనలో మునింగెను. ఆ సమయమున పద్మినివచ్చి
నాయనగారు! లేచి స్నానముచేయుడు, వేడినీళ్లుతోడి యుంచి

తినని పలికెను. ఉమాపతి చకితుఁడై పద్మినిదిక్కు చూచెను. మంచముపైనుండి దిగి అమ్మా! వచ్చుచున్నానుపద, యని పలికి యామెవెనుకనే పోయెను.

వంటగదిలో రాధమ్మ అందఱకును వడ్డించెను. చిన్న కుమారులు జనార్దనుఁడును, శివుఁడును నొకచోట గూరుచుండిరి. వారిప్రక్కగనే పద్మినికి వడ్డించెను. ఉమాపతి భోజనముకడఁ గూరుచుండెను. జనార్దనుఁడు తండ్రితో, నాయనా! నేను ఒకటవతరగతి ప్యాసైతిని. క్రొత్త పుస్తకములు కొనుక్కొనుమని మాష్టరుగారు చెప్పినారు. అన్నిపుస్తకములకు మొత్తము ఐదురూపాయలగునఁట. మధ్యాహ్నము అందఱకు పుస్తకములు తెచ్చుటకు మాష్టరుగారేలూరు వెళ్లుచున్నారు. భోజనముచేసి, ఐదురూపాయలీయుము. నేను నువారికిత్తును," అనెను వెంటనే శివుఁడు "అన్నకిచ్చిన నాకును ఐదురూపాయలీయవలెను," అనెను, ఉమాపతి వారిరువురవైపును నిదానించి చూచెను. ఒకింతసేపాగి "శివుఁడా! ఐదురూపాయలును నీవేమి చేతువురా? అనెను. "నేనా! నేను దాచుకొందు"నని పలికెను. ఆమాటకు ఉమాపతికి నవ్వువచ్చెను. అంతతో రెండుకన్నులనుండియు రెండుముత్యములవలె కన్నీటి బిందువులు రాలెను. పద్మిని యదిజూచెను. ఆమెకన్నులు చెమ్మగిల్లెను. రాధమ్మ గోడవైపునకుఁదిరిగి కన్నులొత్తుకొనెను. ఉమాపతి ధైర్యము చిక్కబట్టెను. జనార్దనా! రేపు నీ పుస్త

కములు తెప్పించెదనులే. శివా! దాచుకొనుటకు నీకును రేపే యిత్తును. మీరిద్దరును మంచివారే! చెప్పిన మాటవిందురు. అన్నము తినుఁడు. ఎవరు ముందుగఁ దిని లేతురో చూచెద నుగా యనెను. జనార్దనుఁడును, శివుఁడును బెబుగు పోయించు కొని తిని యంతలో లేచి సావడిలోనికి పోయిరి. జనార్దనున కాఱవయేడును శివునకు నాలుగవయేడునువచ్చినవి.

ఉమాపతి యన్నముముందు కూర్చుండుటయే కాని తినలేకపోయెను. కొంతసేపు తినుట నభినయించి కంచములో జేయి కడుగుకొని లేచి వచ్చి గదలోఁ బరుండెను.

చిన్నపుడు సంస్కృతము కొంతవఱకభ్యసించినవాఁడగు టచే నుమాపతికి ఆంధ్రగ్రంథముల నర్థముచేసికొను శక్తి కలిగెను. మంచముమీఁద బరుండి భాగవతమును జదువ సాగెను.

రాధమ్మ భోజనముచేసి చిన్నపిల్లలు నిరువురను దీసి కొని ఏలూరునకు బోవుటకు బయనమైవచ్చి యుమాపతితో "నే నేలూరు వెళ్ళుచున్నాను. రాత్రిభోజనము అమ్మాయి చేయును. అన్నియుఁజెప్పితిని, తిరిగి రేపు ఉదయమునకే వచ్చెదను," అని వచించి వెడలెను. ఉమాపతి రాధమ్మ మాటలాడుచున్నంతవరకును నామెనేకాగ్రతతో వీక్షించెను.

మంచముపైఁబరుండి భాగవతము నాయనదిరుగవేయు చుండెను. ఇంతలో వీథిలోనుండి ఉమ్మయ్యా! యను కేక

వినఁబడెను. ఉమాపతి చివాలున లేచి "అమ్మాయీ! సూరయ్యా యేమో చూడమని తొట్రుపాటుతోఁ బలికెను. పద్మిని చూచి వెంకయ్యయని చెప్పెను. వెంటనే యాతఁడు లేచి ముందు వసారలోనికేగి వెంకయ్యతాతా! రమ్మని వసారాగదిలోనికిఁ దీసికొనిపోయెను.

వెంక — ఉమ్మయ్యా! భోజనము చేయలేదా?

ఉమా — చేసితిని.

వెంక — అట్లుంటివేమి? చేయలేదు. నాదగ్గరనా నీయబద్ధములు?

ఉమా — లేదు తాతా! అన్నము తింటిని. బద్ధకముగనున్నది. అందుచేనట్లు కనఁబడుచుంటిని.

వెంక — మఱల నేదో చేయఁదలచుకొన్నారయ్యా! సత్యమూర్తి, సూరయ్యాయు నుదయమునుండి యొకటే రహస్యములు. ప్రొద్దున సూరయ్యయింటి కేగిన సత్యమూర్తి యిపుడు బయటపడినాఁడు. బయటకు వచ్చుటయేమి. ఇంటికి వచ్చి సంచి చేతఁబుచ్చుకొని వలూరు పోవుటయేమి? నిమిషములో జరిగినది. ఇదంతయు మండపముపైఁ గూర్చొని పసికట్టితిని. అచట కూర్చున్నంత సేపు నీవిషయమై యాలోచించితిని. చక్కని యూహ తోచినది. నీవిది వఱకు నన్నడిగి యుంటివి శ్రద్ధగ వినుము. ఈయాస్తి నీస్వార్జితము. అందు నీ కుమారులును నీవును సమానభాగస్వాములు. కుమారులం

దఱును మైనరులు. వారివంతు వచ్చినవేవియు నెవ్వారును దాకరాదు. ఇఁకనీభాగము పైనమాత్రమే సూరయ్యాతన బాకీరాఁబట్టుకొనవలెను. తెలిసినదా! మైనరులకు రక్షకుడుగ వారిమేనమామ యనిచెప్పి దావాచేయింపుము. సూరయ్యే యేమగునోచూతము.

ఉమా—అమ్మో! కోర్టునకే నేనచటికేగి యాతనికడఁదీసికొనిన ద్రవ్యమీయక వేరువిధముగ వాదించుటయా? తాతా నేఁజేయలేను.

వెంక—చేయనిచో నీకుమారుల కన్యాయము చేసినవాఁడ వగుదువు.

ఉమా—వారిమంచికై, యభివృద్ధికై ప్రయత్నముచేసితిని. అదిసమకూడునట్లు లేదు. అది వారిదురదృష్టము.

వెంక—వారునిన్నట్లు చేయుమని చెప్పిరా?

ఉమా—లేదు.

వెంక—లేనపుడు వారేలదీనికి బాధ్యతవహింపవలెను? బాగుగా యోజింపుము.

ఉమా—తాతా? రాజకీయములకును యాథార్థ్యమునకును మిగుల భేదముండును. నీవుచెప్పినది లౌక్యపద్ధతి. కాదనను. నాది వేఱొక మార్గము. మనసుకష్టపెట్టుకొనకుము. నీమాటత్రోసివేయుచున్నందులకు మన్నింపుము.

వెంక—ఎంతసత్యకాలపు వాఁడవయ్యా! కనుకనే వారు నిన్ను శ్లాఘించుచున్నారు.

ఉమా—నేను సూరయ్యకడ డబ్బు తెచ్చితిని. అతనిద్రవ్య మాతనికొసంగి ఋణవిముక్తుఁడనుగానలెను.

వెంక—ఎట్లు ?

ఉమా—నాకుఁదెలియదు. భగవంతునియిచ్ఛ.

వెంకయ్య—ఉమాపతీ! నీ యట్టివానిని, ఇన్నియేండ్లునాకువచ్చినవి గాని ఎచ్చటను జూడలేదయ్యా! సరే భగవంతునిపైననే భారము వేయుము. నేనింకను భోజనముచేయలేదు. పోవుదును. (ఉమాపతి ఆలోచనతో దిరిగి గదిలో మంచముపైఁబరుండెను.)

---

## ౮

పచ్చిమెరపపళ్లు రాశిపోసినట్లుగఁ దూర్పుదిక్కున సూర్యుఁడు తోఁచెను. క్రమక్రమముగ నారాగమాయనలో లోపించెను. తెల్లనికాంతిపుంజమ ట్లుండెను. ఆపైన నొకింత బంగరురంగుగఁ గన్పట్టెను. క్షమ్మటఁ జూచుచుండగనే దుర్నిరీక్ష్యుఁ డయ్యెను.

ఉమాపతి ప్రతిదినమును వేకువనే లేచు నలవాటు కలవాఁడు. నాఁడాతఁడు మేల్కొనునప్పటికిఁ బ్రొద్దు కరకర లాడెను. లేచినతోడనే దంతధావనాదికము నిర్వర్తించెను. ముందున్న వసారాగదిలోఁ గుర్చీపైఁ గూరుచుండి భగవద్గీతను జదువ మొదలిడెను. పద్మిని తండ్రికన్న ముందుగనే లేచి గృహకృత్యముల నిర్వర్తించెను. ఒకింతసేపటిలో రాధమ్మయు నేలూరినుండి తిరిగివచ్చెను. కుమారు లిరువురును ఉమాపతి కడకు బరువెత్తివచ్చిరి. 'నాయనా! అమ్మకడ డబ్బున్నది. నాకు పుస్తకముల కీయుమని చెప్పుమని జనార్దనుఁడును, నాకును గావలెనని శివుఁడును నొక్కసారిగ బలికిరి. ఇట్లనుచుండగనే రాధమ్మ మగనికడకు వచ్చెను. ఆ యమాయకురాలిచూపులో మీరు చెప్పినపనిని నిర్వర్తించుకొనివచ్చితినను భావము ద్యోతకమయ్యెను. రాధమ్మ తనచేతనున్న ఏబదిరూపాయలును మగనిచేతనిడి "ఇవి మిగిలినవ"ని పలికెను. ఉమాపతి ఆమెను దేరిపారచూచి "నీకు చీరెలు లేవనుకొందును, కొనిన బాగుం డెడిదికాదా! యనెను. ఇంట నిబ్బందిపడుచుండఁగా చీరెలు కొనుమందురా! ఐనను అంతగ నిబ్బందిపడుటలేదు. పద్మినికి మాత్రమే చీరెఁగొంటిని. అని కాగితపు పొట్లమొకటి విప్పి చూపించెను. పద్మిని లోననుండివచ్చెను. ఉమాపతి యామెతో 'అమ్మా! ఇదిగో అమ్మనీకు చీరతెచ్చినదమ్మా! పసపురాచి కట్టుకొనిరమ్మ చూతమెట్లుండునో యనెను. పద్మిని

"అమ్మ కేమియును దెలియదు. ఈ సమయముననే నాకు చీరె తేవలయునా? అనెను. ఉమాపతి తల్లీ! లోనికేగి ధరించి రమ్మని మరల పలికెను. పద్మినియు, రాధమ్మయు లోనికేగిరి. ఇంతలో శివజనార్దను లిరువురును దండ్రినిం జుట్టిరి. జనార్దనుఁడు నాయనా! నా కీయవా యని యడిగెను. ఉమాపతి రెండైదురూపాయల నోట్లను దీసెను. ఇరువురి చేతులలోఁ బెట్టెను. వారి యానందమునుజూచిన యుమాపతి మనస్సు కలతఁ జెందెను. పసివారు. వీరిని వెంకయ్యతాత చెప్పినట్లు నేను బాధుచేయుచుంటినా? అను భావ మొకటి క్షణకాల మాయనలో మెదిలెను. ఆ భావము నాతడు మనసుననే దాచెను. శివజనార్దనులిరువురును లోనికి బరుగెత్తి పోయిరి. ఐదు రూపాయలుమాత్రమే చెంతనున్నవారి యానందమున కంతులేకపోయెను. ఇల్లంతయు నిద్దఱును గంతులువైచిరి. పాటలుపాడిరి. తిరిగి తండ్రివద్దకు వచ్చిరి. పద్మినియు రాధమ్మయు నుమాపతిదగ్గరకు మరల వచ్చిరి. క్రొత్తచీరె ధరించిన పద్మినినిఁజూచి తండ్రి కనులనీరు నింపెను. అమ్మా! నే బ్రతికియున్నచోఁ ద్వరలోనే నిన్ను మోహనుని కడకుఁ దీసికొనివెళ్లెదనమ్మా! యని యప్రయత్నముగ ననెను. రాధమ్మ యటనుండక లోనికేగెను. పద్మిని "నాయనగారూ! తెలియనివారివలె మీరిట్లడుగుచుండుట బాగుండలేదు. కష్టసుఖము లెల్లకాల మొకచోటఁ గాపురముచేయవు. మీరా

రిట్లయిన మే మేమికావలెను? ఆలోచింపుడు" అనెను.
ఉమాపతి_ "నిజమే తల్లీ! ఏదో అట్లు నోటివెంట వచ్చినది. లోనికేగి పనిచూచుకొనుడు. నేను భగవద్గీతలో నొక యధ్యాయము జదివివచ్చెద" ననెను. (వారు లోనికేగిరి.)

ఉమాపతి విశ్వరూపసందర్శనమును బఠించెను. భాగవతమందలి పద్యములను బఠించెను. సహస్రనామ స్తోత్రమును భక్తితోఁ జదివెను.

కొంతసేపటికి లోన గదిలోని కేగిమంచముపై పరుండెను. నిన్న పగలు భోజనము చేయలేదు, రాత్రి భోజన మసలే లేదు, అన్నగతప్రాణము. అపుడే నీరసమయ్యెను. అది నిద్దుర కాదుగాని కనులు మాత్రము మూసికొని పరుండి యుండెను. పరుండినవానికే సత్యమూర్తిని బిలిపింప గోరిక పుట్టెను. వెంటనే లేచెను. జనార్దనునిఁ గేకపెట్టెను. అతఁడు వచ్చుటయే తడవుగ 'నాయనా! బాబాయిని పిలుచుకొని రమ్మ'ని పంపెను. మంచముపై నట్లే కూర్చుండెను. జనార్దనుడక్కడనున్నట్లే పరుగెత్తుకొనివెళ్ళి వచ్చెను. 'నాయనా! బాబాయి గ్రామములో లేడఁట' అని చెప్పెను. అది విని ఉమాపతి ఔను. వెంకయ్యతాత నిన్ననే యాతఁడేలూరు వెళ్లుచున్నట్లు చెప్పినాఁడు. మఱచితినని యనుకొనెను. తిరిగి మంచముపై పరుండి కనులుమూసికొని నిద్రపోసాగెను.

అప్పటికి పది దాటినది. పద్మినివచ్చి తొంగిచూచెను. ఉమాపతి కనులుమూసికొని నిద్రించుచుండెను. నిద్రాభంగ మొనర్పనేల ? అని లోనికిఁబోయెను. పదునొకండుగంటలకుఁ దిరిగివచ్చెను. ఉమాపతి కదలుచుండెను. నాయనా స్నానము చేయుమని పద్మిని యాతనిని లేపెను. ఉమాపతిలేచెను. చాల నీరసముగనున్నదమ్మా ! అనుచు నామె వెంట దొడ్డిలోనికి పోయెను.

ఉమాపతి స్నానముచేసి వచ్చునప్పటికి రాధమ్మ అన్నము పెట్టెను. ఉమాపతి పద్మినికిని బడినుండి వచ్చిన పుత్రులకును దనతో నన్నము పెట్టుమనెను. ఆమెవడ్డన సేయుటయైనతరువాత నెల్లరును దిననాగిరి. జనార్దనుఁడు దనకు రేపు పుస్తకములు వచ్చునని పలికెను. శివునకేమియును ఁకను దోచలేదు. తల్లివైపు చూచెను. రాధమ్మ శివునకు క్రొత్తలాగును గ్రొత్త చొక్కాయును వచ్చుననెను. శివుఁడు అఁ నాకుఁ గ్రొత్తలాగును గ్రొత్త చొక్కాయును వచ్చును. నేను గుట్టించుకొందును. కాదా అమ్మా! అవును నాయనా అని రాధమ్మబదులుచెప్పెను. తనకుగ్రొత్తలాగును జొక్కాయును లేకపోయెనే యని జనార్దనుఁ డాలోచించుచుండెను. తండ్రి యది కనిపెట్టెను. నీకును గ్రొత్తలాగును గ్రొత్తచొక్కా వచ్చునులేయనిపలికెను. వెంటనే జనార్దనుఁడు నాకుఁ బుస్తక ములును వచ్చును. క్రొత్తలాగు చొక్కాలును వచ్చును. నీకుఁ

పుస్తకములురావు, అని శివుని కోడిగమాడెను. శివుఁడీసారి తండ్రివంకఁజూచెను. 'నీకు పెద్దయిన తరువాత కావలసినన్ని పుస్తకములు వచ్చునులేయని యుమాపతి యనెను. నాకు మాత్రము రావా? అని జనార్దనుఁడు పలికెను. అపుడు పద్మిని అందరికిని కావలసినవన్నియు వచ్చును. అసలు ముందిపుడన్న మల్లరిచేయకుండఁగ దిన్న వానికే యవి యన్నియు వచ్చుననెను. క్షణములో నొకరికన్న నొకరు ముందుగ నన్నముఁదిని కంచములో జేతులు కడుగుకొని వీధిలోనికిఁ బరుగెత్తిరి.

ఉమాపతి యన్నముకడఁ గూరుచుండుటయేకానిలోపల కన్నము వెళ్లుటలేదు. ఉన్నంతలో రాధమ్మ హితవుగనుండు నట్లు నాలుగు పదార్థములు చేసెను. ఎన్ని పదార్థము లున్నను మనస్సు సరిగ లేనపుడేల హితవుగనుండును? పద్మిని యది కనిపెట్టెను. 'నాయనా! నీవు సరిగ నన్నముతిననిచో నేనును దినను. దిన దిన మిట్లయిన ఎట్లోపికయుండును? అనిధైర్యములును, నీతులును జెప్పెడివాడవు నీవే యిట్లధైర్యపడిన నేమి ప్రయోజనము' అనెను. ఉమాపతి, నిజమేతల్లీ! లోన జ్వరము తగులుచున్నదేమో హితవులేక తినుటలేదు. నాకేమి నీవు చెప్పవలెనటమ్మా! అంతమాత్రము ధైర్యములేనివాడ నను కొనుచున్నావా? నేఁడుకాకున్న రేపు తినగలను. కానిమ్ము ముందు నీవుభోజనము చేయుము. కృష్ణమూర్తికి మదరాసు

పైకము పంపలేదమ్మా! వాని చదువికనెలలలోనున్నది. పరీక్షకు డబ్బుకట్టవలెనని వ్రాసినాఁడు. ఏమియు పాలుపోక యున్నది' అనెను. నాయనా! నాగొలుసుతీసికొనివెళ్లి అమ్మి పైకము తమ్మునకు పంపుము'అనెను. ఉమాపతి చలించెను. "వద్దు తల్లీ వద్దు. నీనగలుకూడనా? ఏమికావలసిన, భగవంతుఁడేమి చేయఁదలచుకొనిన నదియగును. నీనగలు ముట్టుకొనుటయే! ఆయూహయేని కలుగగూడదు''అని ఉద్రిక్తుడై పలికెను.

నేను అత్తవారింటికి వెళ్ళునపుడు మఱలచేయించుకొని వెళ్ళవచ్చునుగదా ఇంతలో నేమియిబ్బంది వచ్చును? అని పద్మనితిరిగి ప్రశ్నించెను. ఏమైనను నీనగలను నేనుముట్టుకొనను. ఉపాయాంతరమాలోచింతము లెమ్ము. అని యుమాపతి నిబ్బరముగ బలికెను.

నాలుగుమెతుకులు కతికి ఆతఁడు గదిలోనికి వచ్చెను. మంచముపై మేనువాల్చెను. సత్యమూర్తి అందఱనుకొని నట్లు నాపైగక్షవహించెనా! నేనాతనికేమి యుపకారము చేసితిని? ఏమియును జేయలేదు. ఐనపుడాతడు నాపైనట్లు చేయుటకు హేతువేమై యుండును. నాయూహా కేమియువచ్చుటలేదు. ఉపకారమొనర్చినను అపకారమొనర్చినను కొందఱకు అపకారమొనర్చుచుండుటయే సహజగుణమగునేమో! కొందఱు తమ కితరులుచేసిన ఉపకారాపకారముల లెక్కింపక

తిరిగి వారికుపకారమే చేయుచుండుటలేదా ! అట్లే వీరును. ఇంతకును నాకుసత్యమూర్తి ద్రోహముతలపెట్టుచున్నాడని నిర్ధారణ మైనది. కావున నూరక నిందనీతనిపై వేయుట దోషముకాదా! నాకిన్ని యేండ్లువచ్చినవి కాని ఈ కొలఁది దినములలోనే గడించినంత లోకానుభవమునంతకుపూర్వము గడించియుండలేదు. తలఁచినకొలఁదియు లోకము చిత్రచిత్రముగా నున్నది. అనియాలోచనాపరంపరలోఁబడెను. అప్పటికి మధ్యాహ్నము దాటినది. ఒంటిగంటకా వచ్చినది. వీథిలో డప్పుమోత మ్రోగించుట వినఁబడెను. ఆమోత క్రమముగ నుమాపతి యింటిసమీపమునకు వచ్చుచుండెను. ఆమోతవిని ఉమాపతి ముందువసారాలోని కేతెంచెను. వసారాలోని కుమాపతి వచ్చుటయే తడవుగ వెంకయ్యయు, భూషయ్యయును వచ్చిరి. ఉమాపతి వారిని వసారాగదిలోనికి గొంపోయెను.

భూష—ఉమ్మయ్యా! చాలతగ్గిపోతివిసుమా! బెంగపెట్టుకొంటివా యేమి? వ్యవహారము చేయుటకు వీలుగనున్నది. వెంకయ్యనీతో జెప్పెనఁటగదా! ఆస్తిగవ్వంత సూరయ్యకుఁదక్కనీయరాదు. చూచితివా ఇప్పుడేమి చేసినాఁడో! పొలములకును ఇంటికిని జప్తుపెట్టించినాఁడు. అదియే నాయకుఁడు డప్పువేయుచున్నాఁడు. అమీనాసంతకముల కిచ్చుటకు వచ్చును.

ఉమా—మొన్న జప్తు ఐనదిగదా! మరలనిప్పుడెందులకు?
వెంకయ్య—పిచ్చివాడా! అది పైరుజప్తు, ఇది భూమిజప్తు,
ఉమా—సరి తెలిసినది.
భూష—వెంకయ్య చెప్పినసలహా నాలోచించితివా?
ఉమా—ఆలోచన కేమున్నది. డబ్బు తెచ్చుకొని ఎగవేయుట
యనిన మనసొప్పుట లేదయ్యా!
భూష—ఇంకను ఆదారినేయున్నావా! ఆస్తి అనుభవించు
కాలము లేదేమో!

ఇంతలో అమీనా కాగితములతో నచటకు వచ్చెను. ఉమాపతి వానిపై చేవ్రాలుంచెను. భూషయ్యయు వెంకయ్యయు సాక్షిసంతకములు చేసిరి. అమీనా తనదారిని పోయెను. పొలములలో కుప్పనూర్పిళ్లున్నవని ఇద్దఱును చెప్పి వెడలిరి.

ఉమాపతి లోనికివచ్చెను. మరల మంచముపై పరుండెను. వెంకయ్యకును, భూషయ్యకును గోపమువచ్చినట్లున్నదని యూహించెను. వారిసలహా తీసికొనుట మంచిదేమో! సలహాకై సత్యమూర్తి నడిగితినిగాని యాతడు తిరిగిరాలేదు. వీరునేగోరకుండగనే చెప్పుచున్నారు. దీనిని నేను దిరస్కరించుచున్నాను. ఇదిమర్యాదకాదు. వారిని కబురంపి రాత్రికి తగిన యాలోచన చేయుటమంచిదగునా? నాబుద్ధి పెడత్రోవను బట్టుచున్నదా? అబ్బ! ఏమి యీ మానసికవేదన నేను దట్టు

కొనఁజాలకున్నాను. నేనేమియుఁ బ్రయత్నము చేయను. అన్ని ప్రయత్నములును భగవంతుఁడే చేయును. ఇంతకాల మీయాస్తి నేనెట్లనుభవింపఁగల్గితిని? దానికి నాప్రయత్నము లేదు. ఇపుడు పోవునపుడును నాప్రయత్నముండరాదు. ప్రయత్నముచేసిన నెఱవేరునను హామీ గలదా! ఎట్లుండును? ఎవరుచెప్పెదరు. అంతటిని నడపెడి యా దేవున కొక్కనికే సర్వమును దెలియునుగాని మిగిలినవారి కేవియుఁ దెలియవు. అనిదలచుచు మరలమంచముపై పరుండెను.

---

౬

సత్యమూర్తి సూరయ్య ఇంటనే ర్రాతింబవళ్లు కాలము గడపుచుండెను. ఒకటేయాలోచన. నిద్రాహారములు లేవు. యుక్తిపై యుక్తులు. ఊహాలపై యూహాలు. వారిద్దఱకును ఉమాపతిని జయించుచున్నామని పట్టరానిసంతసము. కల్లకపట మెఱుగని యుమాపతిని జయించివారు సంపాదించిన దేమి? గ్రామమంతయు నాయిద్దఱకును విరోధమయ్యెను. ఏ పాప మెఱుగని యుమ్మయ్యను బాధించినవారు బాగుపడుదురా యని నీలాటి రేవులలో పేరంటాండ్రనోటినుండి ఎడతెగకుండగ వినవచ్చుచుండెను. వారువీరనక ఎల్లరును నాయిరువురపై యసహ్యాభావమును గనిపింపఁజేయుచుండిరి.

బడిలో బాలురును బాలికలును, సూరయ్యా ఉమ్మయ్యాను ఇంటినుండి బయటకు వెడలగొట్టించునట ! అని వంతులెఱుఁగకుండ జెప్పుకొనిరి. ఉపాధ్యాయులంద రొకచో జేరి యీ విషయమునే చర్చించిరి. పొలములోఁ బనివాండ్ర కిదియే మాటలాడుకొనదగిన విషయమయ్యెను.

సామాన్యముగఁ బల్లెటూరునఁగల యాచార మెంతో విచిత్రముగనుండును. అందున్న ప్రతిగృహమందలి యాంతరంగిక బహిరంగ విషయములన్నియు నందఱెఱుంగుదురు. రహస్యముగ నే విషయమును నుండుటకు వీలు లేదు. అందును ఇట్టివైన నెప్పటికప్పుడే తెలియును.

ఆనాఁడు మండపముపై బెద్దచిన్నలందఱును గూరుచుండిరి. తెగలు తెగలుగాఁ జేరి ఉమ్మయ్యా విషయమే చెప్పకొనసాగిరి. సాధారణముగ బెద్దవయస్సువారిలోనుండు కృత్రిమము చిన్నవయస్సువారిలో నుండదు. యౌవనము జీవితావస్థలన్నిటిలోఁ జాల యోగ్యమైనది. సుఖము లనుభవించుటకు, పరోపకార మొనర్చుటకు, విజ్ఞాన మార్జించుటకు, ఒకటియేమి సర్వమునకును నావయస్సుతగినది. అపుడుండు త్యాగబుద్ధి వయసు వచ్చుచున్నకొలందియు సన్నగిల్లుచుండును.

స్వదేశమును సముద్ధరించుటకు యువకుఁడే ముందు దూకును. ఆత్మత్యాగ మొనర్చి పలువుర ప్రాణములు నిలుపు

టకు ఆతఁడు వెనుదీయఁడు. మోసము, ఈర్ష్య మొదలగు నధమ గుణములు గలవారిని ఆతఁడు లెక్కగొనఁడు. ధనవంతులు గదాయని వారి దుష్ట ప్రయత్నముల నుపేక్ష సేయఁడు. మాట పడఁడు. మోమోటమి లేకుండగ మంచిచెడ్డలు తేల్చును. ఇట్లు యువకుని జీవితము నిర్మలమై స్వార్థరహితమై యుండును. ఈ లక్షణములే మండపమున నొక మూలగఁ జేరిన కొందఱిలోఁ గానవచ్చెను. సూరయ్య, సత్తెయ్యలు గ్రామమును బాడుచేయుచున్నారని వా రేకగ్రీవముగ నంగీకరించిరి. అగ్నికి వాయువుతోడైనట్లు సత్తెయ్య స్నేహముతో సూరయ్య కోనున్న దుష్టశక్తులు విజృంభించెను. గ్రామమందున్న చిన్న చిన్న కలతలను వీరు తీర్చుటకు ముందుకువత్తురుకదా వానిని దీర్చుటకు వీరికిఁగల తాహతు ఏమి? న్యాయముగ నెన్ని తీర్చిరి? తమవద్ద న్యాయముచేతుమని పైకము తీసికొని యన్యాయముచేసిరని ఎందఱు వాపోవుటలేదు? ఊరుఉమ్మడి విషయములలో వీరు కల్పించుకొని చేయుచున్న ఉపకారమేమి? చేయని అపకారమేమి? జాతరలకు సమారాధనలకు వీరు వసూలుచేసిన ద్రవ్యమునకు లెక్కలు చెప్పరేమి? ఎప్పుడును ముందుగఁ గాగితముపైఁ జందా కనపడుటయే కాని వారివంతు వసూలిచ్చుచున్నారో లేదో తెలియజెప్పరేల! పనులు పూర్తియైనపిమ్మట నైన జమాఖర్చులు చదివి వినిపించరెందుచేత? వీరు ముందుగ చివరనున్నవారి పొలములు

తడుపుకొనుటకు ముందున్న పొలములవారు మానుకొని ఏల పోసియవలెను? పచ్చికబీళ్లు వేలములో వారిపాటపై నెవరును ఎక్కువ పాడరాదనియు, అట్లు పాడిన తమ మర్యాదకు భంగము కలుగుననియు నెల్లరను కట్టడిచేయుటేల? ఇట్లొకటి కాదు రెండుకాదు వీరిరువురును మన గ్రామమునఁ జేరి యన్యాయము లనేకములు చేయుచున్నారు. వీరి నిట్లు పెరుగ నిచ్చితిమా ముందుముందు వీరిద్దరును మన యంకెకు రారు. ఈ దుర్మార్గము నరికట్టుటకు మన మాలోచింపనిచో ముందు మనమే బాధలుపడవలసియుండును. కాఁబట్టి మీరు కూడ ఏదిచేసిన బాగుండునో ఆలోచింపుడు అని యొక యువకుడు వారి కుపన్యాసమిచ్చెను. ఆ యుపన్యాసమును భూషయ్య వినెను. ఆతనిలో "సుబ్బయ్యా! కొంచెమోపిక పట్టుడు. మా పైనఁగూడఁ గొంతభారమువేయుడు. సమయము వచ్చినపుడు చూతము" అని పలికెను. వారెల్లరును మునసబుగారి మాటలకు ఎదురు సమాధానము చెప్పలేదు. ఒకరొక్కరే యటనుండిపోయిరి.

మండపముపై నెల్లరును సూరయ్యమాటయే చెప్పుకొనుచున్నారని పనికత్తె సూరయ్యగారి భార్యతోఁ జెప్పెను. ఊరకందరేకమై ఏమిచేయుదురోయని యామె భయపడెను. ఆ సమయమున సూరయ్య సత్తెయ్యలు గదిలోనే యుండిరి. ఆమె తలుపుచాటున నొదిగియుండి ఇటు లనెను.

"సత్తెయ్య అన్నగారూ! ఇంతవఱకు నేను మీ యాలోచనలకు అడ్డుచెప్పలేదు. ఉమాపతిగారి విషయములో మీ యిరువురును ఆలోచన మొనర్చి ఏమేమో చేయుచున్నారు. నేను కాదనలేదు. ఉమాపతిగారు అందఱవంటి వాఁడుకాదు. సత్యకాలపువాఁడు. ఆయన భార్య రాధమ్మ కల్లకపటము లెఱుఁగనిది. ఆ దంపతులు పార్వతీపరమేశ్వరులు. పెద్దసంసారులు. ఒకరికి ఇంత యిచ్చి, ఇంత అనుభవించినవారు. వారికి కష్టములు కలిగించుట నామనస్సునకు ఇష్టములేదు. మాకా తినుటకొక నలుసైనలేదు. ఏనాఁడుచేసిన పాపమో సంతానము లేకపోయినది. ఈ నాఁ డున్నదికదా యని చేతిమీఁదుగ దానధర్మము లాచరించుటలేదు. ఈ యున్న దంతయు నెవరికిఁ గట్టిపెట్టవలెను? ఏమి చేయవలెను? సోలెడు నూకలతో దినము వెళ్ళిపోవును. ఇంకను ఆస్తి సంపాదించి, ధనము మూటకట్టి ఏమిచేయుమందురు? పాపిష్ఠి ఋణము ఏనాఁడు ఉమాపతిగారి కిచ్చితో ఆనాడే మొదలు వారియింటి కేఁగవలదని నన్ను నిర్బంధపఱచినారు. అటులేయుంటిని. నిన్న రాధమ్మ చెఱువద్ద కనిపించినది. లక్ష్మమ్మ వదినా యని నోరారఁ బలుకరించి మాటాడినది. మీరు వారికిఁ గలిగించు చున్న కష్టము లామెమనస్సులో నున్నవో లేవో! ఆమెపలుక రించుసరికి నాప్రాణము చచ్చిపోయినది. ఏదో లోకాభిరామా యణము మాటాడితిమి. ఉమాపతిగారిని బాధింపక నెమ్మదిగ

ధనము వసూలుచేయు నుపాయమును జూచుచు. మనుష్యులు శాశ్వతముగనుండరు. మాటలును జేసినపనులును ఎల్లకాలము నిలిచియుండును. ఆయన మావద్ద పైకము తీసికొనునపుడు ప్రపంచమున ధర ఎంతగఁ బడిపోవునని తలఁపలేదు. ఒక్క సారిగ నీవిలయము ప్రపంచమునకేవచ్చినది. తానై మాపైకి మాయన ఎగవేయుట కెన్నఁడును జూడడు. సత్తెయ్యబాబూ! నీయాస్థియంతయు బోగొట్టుకొనఁగా నీయూర నీవు నిలిచి యింత అన్నము తినుటకు ఇరువదిఎకరముల భూమినిమీయన్న ఉమాపతిగారిచ్చిరా వేఱొకరిచ్చిరా? చెప్పుము, ఆ దంపతుల సంగతియేవేఱు. వారు మానవలోకమున నుండవలసినవారు కారు. ఏదేవలోకమునవో నుండవలసిన ధన్యజీవులు. బాగుగా యోజించి, ఐనదేదో ఐనది, ఇకనైన వారిని కష్టములపాలు చేయకుడు. నే నేదో చెప్పుచున్నానని త్రోసివేయకుబాబూ!" అని పలికెను.

లక్ష్మమ్మ చెప్పుచున్నంత వఱకును సూరయ్య క్రోధ మాపుకొనెను. పిమ్మట రౌద్రమూర్తియై "ఛీ! వివేకహీనురాలా! మాకు నీతులు నేర్పవచ్చితివా? ఊరకొనుచుంటిని గదాయని నెత్తికెక్కుచుంటివే! మగవారివ్యవహారములలో నీ జోక్యమేల! పొమ్మనవల"కని గద్దించెను. లక్ష్మమ్మ "ఇన్ని వాళ్లనుండియు మీనోటికి వెఱచియే యూరకొంటిని. గ్రామ మంతయును విరోధమైన జేసెడిదేమి?"

సూర—విరోధమైన నేమిమునిగిపోవును ? నేఁటినుండియు ననవ
సరముగ నీ వ్యవహారమున జోక్యము కలిగించుకొనకుము.
లక్ష్మ—అన్నగారూ! మీరైనను వారికిఁజెప్పుడు.
సూర—నోరు మూయుదువా లేదా ?
సత్య—బావగారూ! తొందరపడకుడు.

లక్ష్మమ్మ గిరుక్కునఁదిరిగి లోనికేగి తలుపు బ్రద్దలగు నట్లు వేసెను. సత్యమూర్తి సూరయ్యతోఁజెప్పి ఇంటికిబయలు దేఱెను. త్రోవలోఁ బిల్లలు సత్యమూర్తిని విక్రృతముగఁ జూడ సాగిరి. సత్యమూర్తి యది గమనించెను. ఇంటిలోనికేగెను, భార్య యాతనికై ఎదురుచూచుచుండెను. మగనిఁ జూచుట తోడనే శాంతమ్మ ముఖమింత యయ్యెను.

సత్య—ఏమట్లు చూచుచుంటివి ?
శాంత—అదృష్టము, ఏ యాపదయును లేక వచ్చితిరి.
సత్య—ఆపద యనఁగా ?
శాంత—ఊరందఱు నొకటై సూరయ్యగారిని మిమ్మును గొట్ట వలెనని మండపము కడఁగూరుచుండి తీర్మానించు కొని రట! ఈ విషయము గ్రామమంతయు నొక్కసారిగ గుప్పు మన్నది. మీరింటికడ లేరు. ఏమో ! కోపమువచ్చిన వా రెంతకైనఁదగుదురు. ఎచటనున్నారో, ఎట్లున్నారో యని భయపడితిని. ఐనను మీరీ గ్రామవ్యవహారములలో జోక్యము కలుగజేసికొనవలదని యనేకమారులు చెప్పి

యున్నాను. నామాట పెడచెవి నిడితిరి. మీయన్నగారి
వ్యవహారము చేపట్టుటతో మరింత యూరివారికి క్రోధ
కారణమయ్యెను. అదియునుగాక మీరెవరిని సాధింపఁ
దలఁచితిరి? అన్నగారినా? ఎందులకు? సమాధానమేమియుఁ
జెప్పలేరు. అట్టిచో నూరివారికిఁ జులకనగాక ఏమగుదురు?

బావగారు దేవతాంశములు. వారియం దొకటైన చెడు
గుణము వ్రేలుమడచి చూపుటకుఁ గానరాదు. ఊరంద
ఱాయన బిడ్డలు. అందఱ కాయన తండ్రి. అట్టి పూజనీయుఁడు
మీ కన్నగారైనందులకు సంతసింపవలసినది పోయి పరోక్షముగ
వారినిఁ గష్టపెట్టుటకుఁ బ్రయత్నముచేయుట ధర్మమగునా?
ఆలోచింపుడు, ఆడుదానను, సర్వమును దెలిసిన మీకేమి
తెల్పగలను. వేయి చెప్పనక్కఱలేదు. దయదలఁచి వారొసం
గిన ఇరువది యెకరముల భూమివలననే గదా మన జీవితము
గడచుచున్నది! సూరయ్య డబ్బిత్తునన్నాఁడని యాయనకు
సాయము చేయుచుంటినని యొకమారు పలికితిరి. ఇట్టి
సూరయ్యకు సాయమొనర్చుటయా లేక అన్నగారిని హతమా
ర్చుటయా? కుటుంబమును పోషించుచున్న యాధర్మరాజుపై
నెట్టి కృతజ్ఞత జూపుచుండవలెను?

మీరు పంచుకొనిన యాస్తియేమైనది? సూరయ్యా
గారిచ్చు పత్రము నిలుచునా! ఎంత వెఱ్ఱి! తెలియక కాదు.
తెలిసియుఁ దప్పుద్రోవను ద్రొక్కుచున్నారు. ఐనకర్మమైనది.

నేటినుండియు నీ వ్యవహారములో గల్పించుకొనవద్దు. ఈ వ్యవహారములోననే కాదు. గ్రామ వ్యవహారములలో దేనిలో నను దల దూర్చవలదు. మీపాదములకు మ్రొక్కి చెప్పు చున్నాను. ఆ యిరువది యెకరములను సేద్యము చేయించు కొనుచు హాయిగ నింటఁ గూరుచుండుడు. ఏమందురు?

సత్య—నీ యుపన్యాసమైనదా?

శాంత—నేను మనసార వచించుచుంటిని. మీరును హృదయ పూర్వకముగ నాకు మాటనీయుడు. నాది యుపన్యాసమని ఎకసక్కెముఁ జేయవలదు. ఆ యుపన్యాసము మీమనసుఁ ద్రిప్ప గలిగినా ధన్యాత్మురాలను.

సత్య—పిచ్చిదానా! నీవు అన్నము తినినట్లు లేదే!

శాంత—అన్నముముందుఁగూరుచుంటిని. ఇంతలో గ్రామమం తయు నావార్తతో నట్టుడికి నట్లుడికినది. మీరు నాకనులకుఁ గనిపించనిదే భోజనము చేయఁదలఁచుకొనలేదు.

సత్య—నేనుమంచివాఁడను కానుగదా! నాకై యేలపరిత పించెదవు?

శాంత—మంచివారు కారుగనుకనే పరితాపము.

సత్య—ఇఁక నీవాక్చాతుర్యమును గట్టిపెట్టి భోజనము సేయుము.

శాంత సత్యమూర్తి మాటపై భోజన మొనర్చుటకు వంటయింటిలోనికేగెను. అప్పటికి రెండుగంటలు దాటెను. మారయ్యయింట లక్ష్మమ్మయు, దనయింట శాంతయు నొక్క

సారెగ హితబోధ కావించిరి. ఇద్దఱును సంప్రతించి చెప్పినటులుగ ననిపించెను. ఈ బోధచే సత్యమూర్తి మనస్సున నాలోచనాశ మొకఁను పుట్టెను. ఆ యాశ మాతనిఁ బట్టుకొని వదలలేదు. వదలకపోవుటయే కాదు. దానినిగూర్చి యోజింపుమని తొందరపెట్టెను. లక్ష్మమ్మయు, శాంతయు, దన కన్నగారిరువది ఎకరముల భూమి నిచ్చుటను మహాకార్యముగఁ బేర్కొనిరి. అది అట్టిది యేమగునా? ఆయిరువది ఎకరములును అప్పుడే పదివేల రూపాయలకిమ్మత్తు గలిగి యుండెను. ఆ రోజులలో నది యుచితముగ నిచ్చుటయనిన సామాన్యవిషయము కాదు. నిజముగా నన్నగారు మహాత్యాగి. నాయనగారు నా బాల్యముననే గతించిరి. విద్యకై యీయనయే ప్రయత్నించి యింతజ్ఞానముగలుగు నట్లైనఁ జేసిరి. నావివాహమునకు ఎంతకష్టపడి పనిచేసినదియు నాకు జ్ఞాపకమున్నది. ఇట్లు నాకు సర్వవిధములఁ దోడ్పడిరి గదా. నే నిట్లేల ఆయనకు ద్రోహము తలచుచున్నాను. తమ్ముడా నీవు బాగుగనాలోచించి నాకు సలహాకొసంగుమని కబురంపియడిగినాను. కపటమనునది యాయన యెఱుఁగడు. కనుకనే గ్రామమంతయు నాయనను దేవుడనుచున్నది. ఆ దేవునకా నేను ఎగ్గు తలపెట్టినది? నాకై రెండుమూఁడు సారులు ఇంటికిఁ దిరిగెను. ఎంత నిష్కల్మషహృదయము! మంచిగుణములో నంత మహాత్మ్యమున్నదేమో! ప్రతివారును ఆయనను గీర్తించువారే.

నరసయ్యా నన్నుఁ దూలనాడినపుడు వచ్చి నాయది తప్పయినను బల్లెత్తి మాటాడలేదు. నరసయ్యాకు నాకు మారుగఁ దాను పదిరూపాయలను బంపెనట! ఇది మానవుల ప్రకృతికాదు. నేను ఇంతవరకు నీ విషయములే యూహింపనైతినేల?

ఇట్లు సత్యమూర్తి మనసులో నాలోచనలు తరంగములవలె బయలుదేఱెను. సామాన్యముగ మనుజు లందరును నందఱచే దాము గౌరవింపబడుచుండవలెననియు, నందరకన్న మిన్నగ నుండవలెననియు వాంఛించుచునే యుందురు. కాని తమ్మాశ్రయించుకొనిన యంతశ్శత్రువులు వారిని సరియైన మార్గమున నడువనీయవు. మఱియు మనస్సు చాల బలహీనమైనది. బుద్ధివలె దృఢమైనదికాదు. కనుకనే పలుసారులు పల్లటీలు కొట్టుచుండును. దానితో దాని కాశ్రయమైన మనుష్యుఁడు గుణహీనుఁడగును. ఒకానొకఁడు యోగ్యుఁడని పేరుపడసె ననుకొనుడు. అతఁడు ముందుకూడఁ దప్పక యోగ్యుఁడనిపించుకొనగలడని నిస్సంశయముగఁ జెప్పలేము. ఒక సన్నివేశముగాని, ఒక సమయముగాని, ఒక యనుభవముగాని మనుజుని లోఁబఱచుకొనఁదలఁచు మనస్సునకు అనుకొనకుండగ సాయము చేయును. అపుడు బుద్ధి యెంత చెప్పినను మనసు చెప్పినట్లోవనే మనుజుఁడు పరువెత్తును.

హత్యలు చేయుటకు వెనుదీయని మనస్సు కడు దృఢమైనది. అది దాని మార్గమునఁ బోవునంత కాలము, మంచి చెడ్డలు, యుక్తాయుక్తములు మొదలగువానిని లక్ష్యము చేయదు. ఆ మార్గమును వీడి సన్మార్గమునకుఁ దిరిగెనా యిటు కూడ మంచియనున దెంతవఱకుండుట కవకాశముగలదో దాని పారమును ముట్టును. సత్యమూర్తి యంతకుపూర్వ మెన్నడును దన జీవితమున లేని యొక ఆత్మపరిశోధనానుభూతి నార్జించెను. క్రమక్రమముగ నది యాతనిలోఁ బెఱిగి పెద్దది కాఁజొచ్చెను. ఈ మార్పు శాంతమ్మ గమనించుచునే యుండెను.

---

## ౧౦

పదినాళ్లుగ సుమాపతి బయటకు వచ్చుటలేదు. తన వివయ మెల్ల రెఱిఁగిరనియు, దానివలనఁ దనకును, దనవంశమునకును దీరని యప్రతిష్ఠ వచ్చినదనియు నాతఁడు విచారమును బొందుచుండెను. అప్రతిష్ఠ యెప్పుడువచ్చును? ఎవరికైన నీయవలసిన సొమ్మెగవేసినప్పుడు, మర్యాదా హీనములైనకార్యములాచరించినపుడును వచ్చును. అట్టి వాతఁడు చేయలేదు. ఇక నేకారణముచేఁ దాను నలుగురున్న తావునకు వచ్చుటకు

సంకోచింపవలెను ? ఇటులఁగూడ నాతనిమనస్సులో నూహాపోహములుండెను. గ్రామమున దేవుని కల్యాణము చేయవలసి వచ్చెను. మండపముపైకి నందఱును జేరిరి. తమలోఁదాము ఉమ్మయ్యరాలేదని యనుకొనిరి. అతనికొఱకు మనుజునిపంపిరి. "ఉమాపతి, వెంకయ్యయు, భూషయ్యయు నెట్లుచేసిన నేనును నదియే యంగీకరింతును. నేనిపుడు రాలేనని" చెప్పెను. మండపమునీఁద గూడినవారెల్ల ఒక్కసారిగ నామాటకు విచారమును వెలిబుచ్చిరి. సంవత్సరములనుండియు నుమాపతి లేకుండఁగ, నేకార్యమును నాగ్రామమునఁ బరిష్కరింపఁబడియుండ లేదు. నేఁటికాస్థితి సూరయ్య సత్యమూర్తులవలనఁ గలిగినది. ఈ మాట నాసభలో మాట దాఁచుకొనలేనియూవకుఁ డొకఁడనెను. సూరయ్య 'నాకుఁ దీరికలేదని' యచటకు వచ్చుటను దప్పించుకొనెను. సత్యమూర్తి గ్రామమునలేడని చెప్పబడెను. పెద్దలెల్లో యావిషయమును స్థిరీకరించిరి.

ఉమాపతి తలకట్టినది మొదలు తనపొలమును స్వంత సేద్యము చేయుచుండెను. రకరకముల ఎడ్లు, గిత్తలు, ఆవులు దూడలు అనేకము లాతనికొట్టములోఁగలవు. వానికొఱకాతఁడు ధనము వ్యయము చేయుటలో వెనుదీసెడివాఁడు కాడు. పాలిచ్చు గేదెలకు, ఆవులకుఁ బ్రత్యేకముగ బలవర్ధకములగు పదార్థములను దగ్గరనుండి మేఁపుచుండెడివాడు. నేఁడు చేతిలోఁ బైకము లేదు. తనకు స్వయముగ మంచిచెడ్డలు

చూచుటకుఁ దగిన శక్తిలేదు. అగుటచే నాతఁడు వానిని ఏమి చేయవలయునా యని యాలోచించెను. తన మూఁడువందల ఎకరములు సేద్యము చేయుటలో నాయూరి మాల లాతనికి ప్రతిసంవత్సరమును మిగుల సాయమొనర్చుచుండిరి. పనిచేసి నపుడెల్ల వారి కాతఁడు కూలి నొసఁగుచునేయుండెను. వారు దీనిని దమ పనిగ నిర్వర్తించుచుండెడివారు. మాలలు వ్యవసాయము చేయుటలో మిగుల నేర్పుగడించినవారు. వారేపని చేసినను హృదయపూర్వకముగఁ, గల్మషరహితముగ, శక్తి వంచనలేకుండగఁ జేయుదురు. ఇన్నివత్సరములుగఁ దాను ధాన్యము నిబ్బడిగఁబండించుటకు వారి సేవయేకారణము. నేఁటినుండియు నాపొలములు దన యధీనమున నుండవు. వారితోఁ దనకు సన్నిహిత సంబంధము దీరిపోవుచున్నది. నేడో రేపో సూరయ్య యీపొలములను గోర్టు వేలములోఁ గొట్టివేయించుకొనును. అపు డీమాలల ప్రసక్తియేమి? ఇట్లు ఉమాపతి యాలోచించెను. వెంటనే మాలపల్లి కబురపంపెను. పెద్దలిద్దరు వచ్చిరి. వారితో నాతఁడు 'శోభనాద్రి! వీరయ్యా! నాకు మీరు చాల సంవత్సరములనుండియు సేవచేసినారు. నేను మీకుఁ దాత్కాలికముగ సేవాఫలముగఁ గూలి నాలి యొసంగుచు వచ్చుచున్నను నది చాలదు. నేఁటితో మీకును నాకును వ్యవసాయపు సంబంధము తీరిపోయినది. మీ మాల పలె ఋణము నేనుంచుకొనరాదు. మాపొలములోఁ దఱచు

సంకోచింపవలెను ? ఇటులఁగూడ నాతనిమనస్సులో నూహాపోహములుండెను. గ్రామమున దేవుని కల్యాణము చేయవలసి వచ్చెను. మండపముపైకి నందఱును జేరిరి. తమలోఁదామే యుమ్మయ్యరాలేదని యనుకొనిరి. ఆతనికొఱకు మనుజునిపంపిరి. "ఉమాపతి, వెంకయ్యయు, భూషయ్యయు నెట్లుచేసిన నేనును నదియే యంగీకరింతును. నేనిపుడు రాలేనని" చెప్పెను. మండపముమీఁద గూడినవారెల్ల నొక్కసారిగ నామాటకు విచారమును వెలిబుచ్చిరి. సంవత్సరములనుండియు నుమాపతి లేకుండఁగ, నేకార్యమును నాగ్రామమునఁ బరిష్కరింపఁబడియుండ లేదు. నేఁటికాస్థితి సూరయ్య సత్యమూర్తులవలనఁ గలిగినది. ఈ మాట నాసభలో మాట దాఁచుకొనలేనియూవకుఁ డొకఁడనెను. సూరయ్య 'నాకుఁ దీరికలేదని' యచటకు వచ్చుటను దప్పించుకొనెను. సత్యమూర్తి గ్రామమునలేడని చెప్పబడెను. పెద్దలెల్లో యావిషయమును స్థిరీకరించిరి.

ఉమాపతి తలకట్టినది మొదలు తనపొలమును స్వంత సేద్యము చేయుచుండెను. రకరకముల ఎడ్లు, గిత్తలు, ఆవులు దూడలు అనేకము లాతనికొట్టములోఁగలవు. వానికొఱకాతఁడు ధనము వ్యయము చేయుటలో వెనుదీసెడివాఁడు కాడు. పాలిచ్చు గేదెలకు, ఆవులకుఁ బ్రత్యేకముగ బలవర్ధకములగు పదార్థములను దగ్గరనుండి మేఁపుచుండెడివాడు. నేఁడు చేతిలోఁ బైకము లేదు. తనకు స్వయముగ మంచిచెడ్డలు

చూచుటకుఁ దగిన శక్తి లేదు. అగుటచే నాతఁడు వానిని ఏమి చేయవలయునా యని యాలోచించెను. తన మూఁడువందల ఎకరములు సేద్యము చేయుటలో నాయూరి మాల లాతనికి ప్రతిసంవత్సరమును మిగుల సాయమొనర్చుచుండిరి. పనిచేసి నపుడెల్ల వారి కాతఁడు కూలి నొసఁగుచునేయుండెను. వారు దీనిని దమ పనిగ నిర్వర్తించుచుండెడివారు. మాలలు వ్యవసాయము చేయుటలో మిగుల నేర్పుగడించినవారు. వారేపని చేసినను హృదయపూర్వకముగఁ, గల్మషరహితముగ, శక్తి వంచనలేకుండఁగఁ జేయుదురు. ఇన్నివత్సరములుగఁ దాను ధాన్యము నిబ్బడిగఁబండించుటకు వారి సేవయే కారణము. నేఁటినుండియు నాపొలములు దన యధీనమున నుండవు. వారితోఁ దనకు సన్నిహిత సంబంధము దీరిపోవుచున్నది. నేఁడో రేపో సూరయ్య యీపొలములను గోట్లు వేలములోఁ గొట్టివేయించుకొనును. అపుడీమాలల ప్రసక్తియేమి ? ఇట్లు ఉమాపతి యాలోచించెను. వెంటనే మాలపల్లి కబురపంపెను. పెద్దలిద్దరు వచ్చిరి. వారితో నాతఁడు 'శోభనాద్రీ! వీరయ్యా ! నాకు మీరు చాల సంవత్సరములనుండియు సేవచేసినారు. నేను మీకుఁ దాత్కాలికముగ సేవాఫలముగఁ గూలి నాలి యొసంగుచు వచ్చుచున్నను నది చాలదు. నేఁటితో మీకును నాకును వ్యవసాయపు సంబంధము తీరిపోయినది. మీ మాల పల్లె ఋణము నేనుంచుకొనరాదు. మాపొలములోఁ దఱచు

సంకోచింపవలెను ? ఇటులఁగూడ నాతనిమనస్సులో నూహా పోడముచుండెను. గ్రామమున దేవుని కల్యాణము చేయవలసి వచ్చెను. మండపముపైకి నందఱును జేరిరి. తమలోఁదాము ఉమ్మయ్యరాలేదని యనుకొనిరి. ఆతనికొఱకు మనుజునిపంపిరి. "ఉమాపతి, వెంకయ్యయు, భీమయ్యయు నెట్లుచేసిన నేనును నదియే యంగీకరింతును. నేనిపుడు రాలేనని" చెప్పెను. మండపముమీఁద గూడినవారెల్ల యొక్కసారిగ నామాటకు విచారమును వెలిబుచ్చిరి. సంవత్సరములనుండియు నుమాపతి లేకుండఁగ, నేకార్యమును నాగ్రామమునఁ బరిష్కరింపఁబడియుండ లేదు. నేఁటికాస్థితి సూరయ్య సత్యమూర్తులవలనఁ గలిగినది. ఈ మాట నాసభలో మాట దాచుకొనలేనియువకుఁ డొకఁడనెను. సూరయ్య 'నాకుఁ దీరికలేదని' యచటకు వచ్చుటను దప్పించుకొనెను. సత్యమూర్తి గ్రామమునలేడని చెప్పబడెను. పెద్దలెట్లో యావిషయమును స్థిరీకరించిరి.

ఉమాపతి తలకట్టినది మొదలు తనపొలమును స్వంత సేద్యము చేయుచుండెను. రకరకముల ఎడ్లు, గిత్తలు, ఆవులు దూడలు అనేకము లాతనికొట్టములోఁగలవు. వానికొఱకాతఁడు ధనము వ్యయము చేయుటలో వెనుదీసెడివాఁడు కాడు. పాలిచ్చు గేదెలకు, ఆవులకుఁ బ్రత్యేకముగ బలవర్ధకములగు పదార్థములను దగ్గరనుండి మేఁపుచుండెడివాడు. నేఁడు చేతిలోఁ బైకము లేదు. తనకు స్వయముగ మంచిచెడ్డలు

చూచుటకుఁ దగిన శక్తిలేదు. అగుటచే నాతఁడు వానిని ఏమి చేయవలయునా యని యాలోచించెను. తన మూఁడువందల ఎకరములు సేద్యము చేయుటలో నాయూరి మాల లాతనికి బ్రతిసంవత్సరమును మిగుల సాయమొనర్చుచుండిరి. పనిచేసి నపుడెల్ల వారి కాతఁడు కూలి నొసఁగుచునేయుండెను. వారు దీనిని దమ పనిగ నిర్వర్తించు చుండెడివారు. మాలలు వ్యవసాయము చేయుటలో మిగుల నేర్పుగడించినవారు. వా రేపని చేసినను హృదయపూర్వకముగఁ, గల్మషరహితముగ, శక్తి వంచనలేకుండగఁ జేయుదురు. ఇన్నివత్సరములుగఁ దాను ధాన్యము నిబ్బడిగఁబండించుటకు వారి సేవయేకారణము. నేఁటినుండియు నాపొలములు దన యధీనమున నుండవు. వారితోఁ దనకు సన్నిహిత సంబంధము దీరిపోవుచున్నది. నేఁడో రేపో సూరయ్య యీపొలములను గోర్టు వేలములోఁ గొట్టివేయించుకొనును. అపు డీమాలల ప్రసక్తియేమి? ఇట్లు ఉమాపతి యాలోచించెను. వెంటనే మాలపల్లి కబురపంపెను. పెద్దలిద్దరు వచ్చిరి. వారితో నాతఁడు 'శోభనాద్రీ! వీరయ్యా! నాకు మీరు చాల సంవత్సరములనుండియు సేవచేసినారు. నేను మీకుఁ దాత్కాలికముగ సేవాఫలముగఁ గూలి నాలి యొసంగుచు వచ్చుచున్నను నది చాలదు. నేఁటితో మీకును నాకును వ్యవసాయపు సంబంధము తీరిపోయినది. మీ మాల పలె ఋణము నేనుంచుకొనరాదు. మాపొలములోఁ దఱచు

పనికి వచ్చువారం దఱకును మాయింటఁగల పశువులను దోలు కొనిపోయి వంతు ప్రకారము పంచుడు. సేవ ననుసరించి హెచ్చుతగ్గులు మీరే నిర్ణయింపుడు. తెల్లవారుజామునఁ దోలుకొనిపొండు. రాగిదమ్మిడీ యీయనక్కఱలేదు. పాలిచ్చు నొక గేదెను మాత్రము నాకై విడుడు. మీరును నాస్థితి యేమైనదో వినియున్నారుకదా!' అనెను. వారిరువురును ఆమాటకు నిర్విణ్ణులైరి ! "బాబూ ! సెలవైనచో సూరయ్యగారు వ్యవసాయము చేయకుండఁగఁ జేయలేమా ? ఇన్ని సంవత్సములనుండియు మీ యుప్పు పులుసు తినుచున్నందులకీమాత్రపు సాయమొనర్పలేమా ? ఆయనయు సత్తెయ్యగారును గలిసి మిమ్ములను బెట్టుచున్న బాధలు మాయూరందఱకును దెలియును. ధర్మప్రభువులు. మీ నోటివెంట నేమాట వచ్చిన దానిని తప్పక చేతుము. వెంకయ్యగారు మాకుఁ దమసంగతి యంతయును జెప్పినారు. కోర్టులకువెళ్లనని చెప్పినారటగా ! కుక్కకాటుకు చెప్పదెబ్బగా వీరికిఁజేసిననేతప్పు తెలిసిరాదు బాబూ ! మేముండగా సూరయ్యగారువచ్చి పొలములు వ్యవసాయము చేయింపఁగలరా ! ఆలోచించి చెప్పండి దొరగారూ! అన్యాయమునకు అన్యాయమే చేయవలెనండీ ! దొడ్డదొరలు మీ పశువులను మేమెట్లు డబ్బియకుండఁగఁ దోలుకొని పోఁగలము" అనిరి. ఉమాపతి వారితో 'మీరు కల్లకపటము నెఱుగని మనుష్యులు. నేనేమిచేయుమని చెప్పిన నదిచేయుదురు.

నాకుఁ దెలియును. కనుకనే మీరు తెల్లవారు జామునవచ్చి
వీనిని దోలుకొనిపొండు. సూరయ్యగారికి మనసులోనైన చెడ్డ
గలుగవలెనని తలచవలదు. మీతోనింకొకప్పుడు సావకాశ
ముగ మాటలాడెదను. పొండు. మఱచితిని మీ పసువుల
వాటాలలో మాపాలేళ్లు ముగ్గురున్నారు. వారికిని వానినిఁ
బంచుడు.నాకుఁదలనొప్పిగనున్నది మాటలాడలే''నని వారితో
జెప్పెను. ఆ యిరువురును ఉమాపతికినమస్కరించుచు కనుల
నీరునింపిరి. ఉమాపతి తనకంటనీరు వారికిగానిపించకుండఁగ
మోము గిరుక్కునఁద్రిప్పెను.

ఉమాపతి నానాఁటికిఁ జిక్కిపోవుచుండెను. అన్నము
కడఁ గూరుచుండుటయేకాని తినుటలేదు. పద్మినియు, రాధ
మ్మయు నాయనస్థితికి భయపడసాగిరి. ఎల్లప్పుడును వీధితలు
పులు వేసియుంచుఁడని వారితోజెప్పెను. తానుగదిలో మంచ
ముపైఁ బరుండుటయేతప్ప వేఱొకపనిఁజూచుటలేదు. పాలేళ్లు
ముగ్గురునుగలిసి యొకదినమున నుమాపతికడకు వచ్చిరి. వారు
వచ్చిరని యాతఁడు ముందు వసారాలోనికి వచ్చెను. వచ్చుచు
సావడిలోఁ దూలి స్తంభముపైఁ బడెను. మోమునకు దెబ్బ
తగిలి యుసిరికకాయయంత బొప్పికట్టెను. పదిదినములుగ
వారుమాపతిని జూడలేదు. పదిదినముల కొక్కసారిగ నిపుడు
చూచిరి. వారు మిగుల నాశ్చర్యపడిరి. ఉమాపతి చాల మారి
పోయెను. మోమునఁ గళలేదు. మాసిన బట్టలుకట్టుకొనెను.

చూపులో దైన్యత తాండవించుచుండెను. అటునిటు చూచి యపుడపుడు బెదరుచుండెను. చాల చిక్కియుండెను. ఈ స్థితిలోనున్న యుమాపతి పాలేళ్ళ హృదయమునకుఁ బెద్ద దుఃఖమును గలిగించెను. ఉమాపతిని జూచుటతోడనే వారు దండముపెట్టిరి. ఆతఁడు వారిని గూర్చుండుడని చేతినాడించెను. తానొక కుర్చీపైఁ గూరుచుండెను. ఏదియో మాటలాడ వలెనని వారు వచ్చిరి. ఉమాపతినిఁ జూచి వారు మాటాడ లేకపోయిరి. ముగ్గురును గనుల నీరు నించుచుండిరి. వారినిఁ జూచి ఉమాపతియుఁ గనులలోనీ రాపలేక పోయెను. ఒక్క రును మాటాడ లేకపోయిరి. ఉమాపతి తమాయించుకొనెను. పిచ్చివారు! మాటాడరేమి? అనెను. ఈమాట గాద్గదికము వహించెను. తిరిగి మాటరాలేదు. వారికి దుఃఖము భరింప రానిదయ్యెను. మఱల ఉమాపతియే తెమల్చుకొని నాగయ్యా! నీవేమో ధైర్యముగలవాడవని యనుకొంటిని! నీవును నింతియేనా? మనము శాశ్వతమా! వెట్టివాడా! ఛీ! ఆడుదానివలె నదియేమి పని యని యంతలో గొంతసేపూరకుండెను. నాగయ్య వెక్కివెక్కి యేడువసాగెను. మిగిలిన ఇరువురును నట్లేయైరి. లోననుండి పద్మినియు, రాధమ్మయువచ్చిరి. ఈ స్థితినిజూచి వారును గనులనీరునింపిరి. ఉమాపతిఅమ్మాయీ! మీరులోనికేగుడని పలికెను. తండ్రి మోముపైనున్న దెబ్బ పద్మినిచూచి అదియేమని ప్రశ్నించెను. స్తంభము తగిలినదని

యాతఁడు బదులు చెప్పెను. వెంటనే యామెకనులనున్న నీరు ప్రవహించెను. లోనికేగి సున్నముఁదెచ్చి పట్టువేసి యట నుండక పోయెను. నాగయ్య మోమెత్తి ఉమాపతితో 'బాబూ' నా తండ్రిని ఎఱుగను. నాకాఱేడేండ్లప్పుడే మీదగ్గరఁ జేరితిని. నాకుమీరు తండ్రిగను రాధమ్మగారు తల్లిగనునైరి. ఇఁక మేమేమికావలెను?. అని యేడువసాగెను. ఉమాపతి అంతకును భగవంతుడేయున్నాడు. అనెను. నాగయ్య భగ వంతుఁడున్నాడా ! నిన్న మొన్నటి వఱకును బంధువలెనున్న కాపురము నేఁడేమికారణమున నిట్లగుచున్నది ? మంచివారికి భగవంతుడులేడు. సూరయ్యగారికి భగవంతుడున్నాఁడు. ఉమ్మయ్యగారూ! మీరు చితికిపోవుట, మేముచచ్చిపోవుట. నాకు నలుబదిదాటినవి. ముప్పదియేండ్లపైన మీ సేవఁజేసితిని. ఒకసారియు మీచే మాటపడలేదు. ఒకదానికి లోటని యింట వెదకుకొనలేదు. మీతోపాటుగ మాయిండ్లును సుఖించినవి. మాకా యదృష్టము తొలఁగినదని'' మాటాడలేక పోయెను. మిగిలిన యిరువురును మోములకు గుడ్డలడ్డము పెట్టుకొనిరి.

మరల నుమాపతియే ధైర్యము వహించెను. నాగయ్యా! నాకుఁదెలియును. మీ ముగ్గురి ప్రాణమును నేను. నన్నెట్లు చూచుచున్నారో, ఎట్లు గౌరవించుచున్నారో నా హృదయమునకుఁ దెలియును. నా యాజ్ఞను భగవంతుని యాజ్ఞకన్న మిన్నగఁ బాలించితిరి. చీకటిలేదు. ముండ్లులేవు.

దయ్యములు లేవు. భూతములులేవు. నేఁజెప్పినపని సాధించుట కేవియు నడ్డురాలేదు. ఆకలి దప్పులు నాయవసరము వచ్చి నపుడు దూరము పోయినవి. అవి మిమ్ముఁగాంచితినను బాధించ లేదు. నే నీ సేవకు ధనధాన్యము లిచ్చిన సరిపోవునా ? మీ ప్రాణములు నాచేతిలోఁ బెట్టి, కష్టసుఖములు నాకడ దాచి, నాకొరకు రాత్రింబవళ్లు చేసినసేవకు విలువయేదీ ? ధన ధాన్యములకు విలువకట్టితినిగాని సేవకువిలువ లేదు. నాగయ్యా మీఋణము నీజన్మలోఁగాదు పదిజన్మలలోఁగూడఁ దీర్చు కొనలేదు. అని కంఠము రుద్ధమగుటచే నాగెను. కొంత సేపైనది. మఱల మొదలుపెట్టెను. నాగయ్యా ! మీకు నాకడపనిలేదు. మానివేతుమని చెప్పుటకు వచ్చితిరా ? అవునా? మీరునాకుమఱలకాన్పించరా? ఏమి? మాటాడరేఁ! అనియుమాపతి పెద్దగపిలపించెను. ఉత్తరక్షణముననే సర్దుకొ నెను. నాగయ్యా! మీరేలకనిపించరు. కనిపించుచుందురు. పోయిరండు, నాకుశరీరములో స్వాస్థ్యములేదు. అనెను. వారు ముగ్గురు నుమాపతి పాదములకు దలలుతాకించి నమస్కరించిరి. లేచి అట్లే నిలబడి యుమాపతికై చూచుచుండిరి. ఉమాపతి గోడను బట్టుకొనుచు నెమ్మదిగ లోనికేగెను. గదిలో మంచ ముపైఁబరుండెను.

అప్పుడు మూఁడుగంటలు దాటినది. ఉమాపతి కృష్ణ మూర్తికి డబ్బుపంపలేక పోతినని మిగుల బెంగగొనెను. ఇన్ని

సంవత్సరములుగఁజదివిన చదువు ఈసంవత్సరముతో నొక దారికివచ్చెడిది. ఆసంవత్సరమునను మూఁడువంతులు గడచి నది. చివరిదినములలోఁ బండినపంటను పీడినట్లు పీడవలసివచ్చు చున్నది. ఇదియాతని మనస్సునకు ఖేదకారణమయ్యెను. మఱి యొకటి నెలదినములలో నిరువదివేలీయనిచో సుందరరావు తనకుమారునకు ద్వితీయవివాహముఁ జేతుననెను. ఆతఁడు నిష్ఠు రుఁడు, అన్నదాసిని నెరవేర్పుకొనఁగలఁడు. తానుకారణముగ కొమార్తకాపురము చెడిపోవుచున్నది. ఇదియొకటిఖేదకార ణమయ్యెను. ఈరెండును దీరవలెననిన ధనము కావలెను. వీనిని గూడలక్ష్యము చేయకుండ నుండవలెననిన వేఱొకటి. ఈసంవత్సరము పండినపంటలో నొకగింజతనచేతికి రాదు. కుటుంబపోషణమెట్లుజరుగును. ఇదిమూఁడవది. ఈఖేదము లన్నియు ముప్పిరిఁగొని యుమాపతిని బంధించివైచినవి. కష్ట సమయమున ధైర్యమువహింపవలెనని యాతఁడు పలురీతులఁ బ్రయత్నముచేసెను. సాధ్యముకాలేదు. లొంగక తప్పినది కాదు. తత్కారణముగనే యాతఁడు మంచమెక్కెను. వ్యాధికి మందుకలదుగాని, ఆధికిమందేది ? లేచినచోఁ దూలెడుస్థితికి వచ్చెను.

రాధమ్మయు, పద్మినియు నుమాపతి స్థితికి బెంగపెట్టు కొనిరి. వైద్యునికొఱకుఁ గబురంపవలెనని తలఁచిరి. గదిలో నున్న యుమాపతికడకు వారిరువురును వచ్చిరి. పద్మిని

నాయనా! యని పిలిచెను. కనులుమూసికొని పడియున్న యుమాపతి యే యాలోచనలో నుండెనో పలుకలేదు. పద్మిని మఱలఁ బిలిచెను. 'ఏమమ్మా! యని యుమాపతి తిరిగి ప్రశ్నించెను. అపుడు పద్మిని "నాయనా! నీ శరీరములో బాగుండలేదు. వైద్యునిఁ బిలువనంపుదుమ'నెను. ఎందుకమ్మా! క్రమముగ నిది తగ్గిపోవును. అనెను. వైద్యుడు వచ్చినంతలో నేమి పోవును? కబురంపుదునని యటనుండి పద్మిని వెడలెను.

ఒకింతసేపటిలో వైద్యుఁడువచ్చెను. ఉమాపతిగారూ! యని పిలిచెను. ఉమాపతి 'ఎవరు బాపయ్యగారా రండని తన మంచముపైఁ గూరుచుండుటకుఁ దావొసంగెను. బాపయ్యగారు నాడి పరీక్షించి దోషము లేదనిరి. బాపయ్యగారి కుటుంబము తరతరములుగా వైద్యవృత్తి నవలంబించుచున్నది. ఆయుర్వేదమున వారు సిద్ధహస్తులు. ఆ చుట్టుపట్టులఁ బేరు ప్రఖ్యాతులు సంపాదించినవారు.

గదినుండి యీవలకు బాపయ్యగారు వచ్చుటతోడనే రాధమ్మ అన్నగారూ! వ్యాధిని గమనించితిరా! మందునకుఁ బంపుమందురా? యని ప్రశ్నించెను. ఆయన "ఉమాపతిగారికి శరీరమున నేవ్యాధియు లేదు. పరిస్థితులననుసరించి బెంగఁగొనిరి. వారిపుడు ధైర్యము నవలంబించునట్లు చేయుటయే ముఖ్యమైన మందు. ధర్మరాజునుబోలిన యాయనకీ స్థితి గల్పించినారు. వారుమాత్రము బాగుపడుదురా? కాల మొక్కవిధముగ

నెవరికిని రాదు. మీరు ధైర్యమువహించి యాయనకు ధైర్యమును జెప్పుడు. ఆహార మేవిధముగనైనను బుచ్చుకొను నట్లు చేయుడు. ఆహారము లోనికిఁ బోవుచున్న నేమందులును అవసరములేదు. నేఁ బోయివచ్చెద"నని పలికి యేగెను.

ఉమాపతిగారింటికి వచ్చివెళ్లుచున్న బాపయ్యగారికిఁ ద్రోవలో సత్యమూర్తి యెదురయ్యెను. అతఁడు బాపయ్య గారినిఁ బాబూ! మీరు మా యన్నగారింటికేగితిరా? యని ప్రశ్నించెను. బాపయ్యగారు అచటనుండియే వచ్చుచున్నాను. మీకు దెలియని దేమున్నది? వారికి వ్యాధికాదు. మనో వ్యాధి. దానికి మందులేదు. సమర్థులైన మీబోటివారే తగిన యౌషధములను జూడగలరు. ఏమైనను సత్యమూర్తి గారూ! ఉత్తముఁడగు నుమాపతిగారి నిట్టి స్థితికిఁ దెచ్చినవారు బాగుపడుదురందురా? ప్రస్తుతమట్లు కనఁబడినను అంతము నకు వారును ఇట్లు కృశించవలసినదే! సాధుసంతాపము కుల క్షయమును జేయునండీ. ఏమనుకొంటిరో! లోకమున నెన్ని చూచుటలేదు. సత్యమూర్తిగారూ! కష్టములు, రోజులు బాగుండనపుడు వచ్చును. ఈ దినము సర్వాభివృద్ధులతోఁ దులఁదూగినవారు రేపే కష్టములలోఁ దగుల్కొనవచ్చును. అది మన మేమియు నిదమిత్థమని చెప్పలేము. చచ్చుట, బ్రతుకుట ఇవి రెండును లోకమున సహజములు. కాని యా బ్రతుకు చావు లెట్లు గలిగినవి అనిమాత్రము లోకము

విచారించును. దానినిబట్టి మనుజుల మంచిచెడ్డలు తేలి పోవుచుండును. ఉమాపతిగారి క్లిష్టపరిస్థితియం దుండుటకుఁ గారణము ఈ జన్మలోఁ జేసినదికాదు. ఎంతయుత్తముఁడు! కలబడియున్నారు. నేఁబోయి వచ్చెదనని నడచెను.

సత్యమూర్తికి నామాటలు వినుచున్నంత సేపును దల దిరుగుచునే యుండెను. ఎంతచమత్కారముగఁ బలికినాడు ఎట్లు నిందించినాడు! నేనేమియు ననుటకు వీలులేకుండఁగ బల్కినాడు. బాపయ్యగారే కాదు. గ్రామమెల్లరును ఈ భావమునే కలిగియున్నారు. నేనును సూరయ్యగారును మాత్రము ఒక తీరుగనున్నాము. సూరయ్యగారు అట్లుండు టలో నర్థముండి యుండవచ్చును. నే నట్లుండుటలో నర్థము కానిపింపదు. ఇట్టి యూహావేశము ఇప్పుడేల కలుగు చున్నది? ఇంతకుముందే కలిగియున్న నెంత బాగుండును! ఈ యూహాపరంపరతో సత్యమూర్తి యిల్లుచేరెను. అంతలో "సూరయ్యగారు మిమ్ములను దీసికొని రమ్మని పంపినార"ని యొకరువచ్చి చెప్పిరి. వెంటనే యాతఁడాతని వెంటనేగెను.

సత్యమూర్తినిఁ జూచుటతోడనే సూరయ్యగారు లోని కేగిరి. ఇరువురును గదిలోఁ బ్రవేశించిరి.

సూర—ఉమాపతిగారు మంచముపైనుండి లేచుటలేదా?

సత్య—నాకుఁదెలియదు. బాపయ్యగారు కనపడి యటులే చెప్పినారు.

సూర—ప్రమాదము రాదుగదా ?

సత్య—ఏమో !

సూర—మనమేమి చేయఁగలము ? మనమేమి చేసితిమి !

సత్య—ఏమి చేయలేము ! ఏమిచేయలేదు !

సూర—అనఁగా?

సత్య—సూరయ్యగారూ ! ఇంతతొందరపడి మనమాచర్యలు జరుపనిచో నాతఁడిట్టిస్థితి కేలవచ్చును ! ఐన మనమూహింప వలసినదట్లుకాదు. చేయుటలోఁ దప్పు కలదాయని యాలోచింపవలెను. మన మిరువురమును దప్పులేదనుకొంటిమి. ఊరంతయు మహాపరాధ మనుచున్నారు.

సూర—ఇంతలో నిట్లగునని కూడ మనము తలచలేదుసుమా !

సత్య—వానిది పేదగుండెయని నేను జెప్పితిని.

సూర—ముందుగ నిల్లు వేలమునకుఁ బెట్టించు నేర్పాటుచేసి వచ్చితిరిగదా !

సత్య—ఆఁ అదియు నాచేతిమీఁదుగానే జరుగును.

సూర—మీరు భోజనము చేయలేదుకదా ! రాత్రి ఎనిమిది గంటలైనది. భోజనముచేసి వత్తురా ?

సత్య—అటులనే, (యని వెడలిపోయెను.)

సూరయ్యకు సత్యమూర్తిలో మార్పు గోచరించెను. ఎప్పటియట్లు కార్యాచరణమునందు యుత్సాహముజూపలేదు.

నిజమే! ఎట్లుజూపును ? వారికి ర క్తసంబంధముఁగలదు. ఉమా పతి యారోగ్యము విషయమై యాతనిలోఁ గొంచెము విచార మున్నట్లుగూడఁ దోఁచుచున్నది. నేనిట్లు చర్యఁ గైకొంటిని గనుకనే పైకము పోకుండఁగవచ్చును. లేనిచో నేమగునో! ఎవరెఱుఁగుదురు! నాయందు తప్పులేదు. లోకులు కాకులు. అనేకవిధములుఁగ మాటలాడుదురు. అవియన్నియు మనసునకుఁ బట్టించుకొనుచున్నచోఁ గార్యము లెట్లుసాగును? ఉమాపతి యట్లగుట పిఱికిగుండె కలవాడగుటచేతనే. ఆ పిఱికిగుండె యేర్పడుటకు నేను గారణముకాదు. సహజముగనే కొందఱు ధైర్యముగలవారగుదురు. కొందఱు పిఱికివారుగ నుందురు. ఈ భేదము అనేక కారణములచే నేర్పడును. అట్టిచో నేను గారణమనుకొను జనుల యూహలు ఆధారరహితములైనవి. మంచియో చెడ్డయో వ్యవహారమున దిగితిని. తుదిముట్టు వర కును జూడవలసినదే. ఇల్లు వేలము వేయుటకు వాయిదా ఇంకను నాలుగుదినములున్నది. ఇప్పటిస్థితినిఁజూడ సత్యమూర్తివెలూరు కోర్టునకువచ్చునని నమ్మకము కలుగుటలేదు. ఎవరు వచ్చినను రాకపోయినను నాకుఁ దప్పదుకదా! ఇట్లు తలఁచుచు నాతఁడు కొంతసేపు సత్యమూర్తికై నిరీక్షించుచుఁ గూరుచుండెను. రాత్రి పదిగంటలయ్యెను. పదునొకండుదాటెను. సత్యమూర్తి యిఁక రాడని నిర్ధారణ చేసికొనెను. వెంటనే నిద్రించుటకేగెను.

---

## ౧౧

మూఁడు రాత్రులు గడచెను. దినదినము నుమాపతి యారోగ్యము క్షీణించుచు వచ్చెను. మంచముపై నుండి లేచుటకు శక్తి లేకుండెను. రాధమ్మ మగని మంచముకడనే కని పెట్టుకొని యుండెను. ఏలూరునఁగల యుమాపతి బావమఱది శంకరమునకు కబురు వెళ్లెను. ఆయన వినుటయే తడవుగ బయలుదేరి వచ్చెను. గ్రామమునఁగల యశేషజనము వచ్చి పోవుచుండిరి. ఎల్లరు నుమాపతిని గీర్తించువారే!

ఉమాపతి యొకొక్కప్పుడు సరిగ మాటలాడు చుండెను. మఱియొకప్పుడు తబ్బిబ్బుగ మాటలాడుచుండెను. రాధమ్మయు పద్మినియు జరించుచుండిరే కాని వారిమనస్సులు మనస్సులలో లేవు. శంకరముగారు కొంచెము వయసు మీరినవారు. అనుభవజ్ఞులగుటచే వారిరువురకు ధైర్యము జెప్పుచుండిరి.

పదిగంటలు దాటెను. కృష్ణమూర్తి పెట్టె నొక దానిని కూలివాని నెత్తిపై బెట్టించుకొని యింటికి వచ్చెను. ఆతనిఁ జూచుటతోడనే పద్మినికి దుఃఖమాఁగలేదు. రాధమ్మ పద్మిని నదల్చి నాయనా! వచ్చితివా! మీనాయనకు బాగుండ లేదురా తండ్రీ! యనెను. కృష్ణమూర్తి వెంటనే గదిలోని కేగెను. ఉమాపతి కనులుమూసికొని యుండెను. నాయనా!

యని కృష్ణమూర్తి పిలిచెను. ఉమాపతి వెంటనే కండ్లు తెరచి ఎవరు మా పెద్దతండ్రియాయని చేతులు చాచెను. కృష్ణమూర్తి యాతని కౌగిలిలోనికి కేగెను. ఉమాపతి హృదయము బ్రద్దలయ్యెను. కనులవెంటనొక ధార. ఒకింతసేపేమియుమాటాడ లేదు. కృష్ణమూర్తి గడ్డముక్రిందచేయిపెట్టి తండ్రీ! వచ్చితివా? మీనాయన నీవు వచ్చునప్పటికేమిచేసెనో తెలియునా? నీకు సెంటుభూమిలేకుండగ, గజముస్థలము లేకుండగ జేసినాడు. పసివాడవు. నన్నునీవుక్షమించితివనరాదు. నిన్నుఁజూడకుండగ నేదాటి పోదునేమో యనుకొంటిని. నీకింత యన్యాయముఁజేసిన నన్ను నీవు చూడరాదనుకొంటిని. కాని భగవంతుఁడు నిన్ను ఇటకు ముందుగనే రప్పించినాఁడు. ఏదీ! ఇటుచూడుము చిక్కిపోతి వేమయ్యా! 'అని యేడువదొడంగెను. కృష్ణమూర్తి కనులలో నీరునిండెను. ఎల్లరును గంట తడిపెట్టుచుండిరి. నాయనా! తమ్ములను బిలువుము అనెను. వెంటనే శివజనార్దనులు వచ్చిరి. వా రా దృశ్యమును భయముతోఁజూడసాగిరి.

ఉమాపతి: రండు దగ్గరకురండు. ఏదీ మీచేతులిటు తెండు. అని వారిరువురి హస్తములను బుచ్చుకొనెను. కృష్ణమూర్తి చేతిలో వారిచేతుల నుంచెను. తండ్రీ! కృష్ణయ్యా! నాపని ఐనది. నేనిఁక బ్రతుకను. నీవు ప్రాజ్ఞుఁడవైతివి. తమ్ములు పసివారు. వారిని పెంచు భారమునీది. నీకేమియు నేనిచ్చి పోవుట లేదు. అక్కయ్య నేమిచేతువోయని దుఃఖాతిరేకముచే

మాటాడ లేకపోయెను. కృష్ణమూర్తి కొంచెము సంభాళించు కొని నాయనా బావ ఎల్లుండి యిటకు వచ్చును. ఇక్కడ నుండి విశ్వనాథముగారు మదరాసువచ్చి నీస్థితిని నాకుఁజెప్పిరి. వెంటనే నేను బావయుండు ఆఫీసునకేగి సంగతి నెఱిఁగించితిని. సెలవు లేక నాతో రాలేదు. ఎల్లుండి తప్పకవచ్చునవెను. ఆమాట యుమాపతి మోమునకుఁ దెలివి నొసంగెను. కుమారుని గాంచి ఆవేశముతో మాటలాడినందుల కుమాపతికి ఆయాసము వచ్చెను. నీరసముచే మాట రాకపోయెను. అప్పుడు రాధమ్మ బత్తాయిపండ్లరసము నొసంగెను. ఉమాపతి సొమ్మసిలి పరుండెను.

శంకరముగారు కృష్ణమూర్తికి భోజనము పెట్టుమని పద్మిని నాదేశించెను. వెంటనేయామె వంటయింటిలోనికేగెను. కృష్ణమూర్తియు స్నానముచేసి వంటయింటఁ జేరునప్పటి కామె వడ్డించి యుంచెను. కృష్ణమూర్తి అక్కా! నాయన కిట్లున్న దని యుత్తరము వ్రాయకపోతివా ? యని ప్రశ్నించెను. ఆమె నాయన వ్రాయవద్దనెనని బదులుచెప్పెను. మరలకృష్ణమూర్తి బాబాయికూడ నీ కుట్రలోనున్నాడఁటగా

పద్మి—ఉన్నాడఁటకాదు. సర్వము నాతఁడేనడిపించుచున్నాడు!

కృష్ణ—ఇంక నెవరున్నారు ?

పద్మి—ఎవరును లేరు.

కృష్ణ—వెంకయ్యగారును, భూషయ్యగారును నెటులుండిరి

పద్మ—వారు ఈ స్థితికి జాల విచారించుచుండిరి.

కృష్ణ—మదరాసులోనే నాకువిశ్వనాథముగారు ఇచ్చుటి విషయములు వ్రాసుగుచ్చినట్లు చెప్పినారు.

పద్మ—నీపరీక్ష ఏమయినది ?

కృష్ణ—నాయన పైకము పంపలేకపోయినాడు. నేనుఫీజుకట్టలేదు. బాకీలు నాయుంగరములు, చేతిగడియారమును నమ్మి తీర్చివచ్చితిని.

పద్మ—అయ్యో ! చదువువ్యర్థమైపోయినదా !

కృష్ణ—బిగ్గరగా ననవద్దు. నాయనకుఁ దెలిసిన వ్యథజెందును. అక్కా! బావగారెంతమంచి వారనుకొంటివి ! సుందరరావు గారాయన కెన్నిలేనిమాటలుచెప్పి మనసుమార్చుటకు ప్రయత్నించెనో. మఱియొక సంబంధముచూచి బావగారికాయన యుత్తరము వ్రాసెను, అట్టిప్రయత్నము లెన్నఁడును జేయవద్దని తిరిగిబావగారుబదులు వ్రాసిరి.

గదినుండి పద్మనిని రాధమ్మ కేకవేసెను. ఆమె పరుగెత్తుకొని వెళ్లెను. రాధమ్మ పద్మనితో నలమరలోనున్న బత్తాయికాయల రసమునుదీసి తీసికొనిరమ్మనిచెప్పెను. ఆమెవెళ్లెను.

కృష్ణమూర్తి భోజనముచేసి చావడిలోనికి వచ్చెను. అటనుండి వెంటనే గదిలోని కేగెను. తండ్రి కనులుమూసికొని పరుండెను.

కృష్ణమూర్తి వచ్చెనని విని పాలేరు నాగయ్య చూచుటకు వచ్చెను. కృష్ణమూర్తిని జూచుటతోడనే నాగయ్య చిన్నదొరా! ఎప్పుడువచ్చితివనెను. కృష్ణమూర్తి నాగయ్యను జూచి – నాగయ్యా! నీవు కనపడలేదేమాయనుకొనుచుంటిని. మాయింట మానితివటగా వచ్చితివా! నీ పిల్లలు బాగున్నారా! యని ప్రశ్నించెను. నాగయ్యకు ఆ పలుకరించినవిధమును జూడ ఉమాపతిగారే యనుచున్న ట్లనిపించెను. ఆ భావము మెసలగనే కనుల నీరు నిండినది. దొరా! ఏమిసుఖము. పెద్దదొర కిట్లుండగా మా కేమిసుఖమని పలికెను. కృష్ణమూర్తి నాగయ్యతో నాగయ్యా! రెండుమూడు రోజులు ఇచటనుందుము. మనుష్యుని అవసరముండును. ఎవరి పనికిని వెళ్ళవద్దనెను. దొరా! ఉండదలచియే వచ్చితిననెను.

రెండుగంటలకు బయలుదేరి కృష్ణమూర్తి వైద్యుని యింటికివెళ్లెను. వీథిలో నెల్లరును నాతనిఁ బలుకరించువారే! అందరకు నాతఁడు సమాధానములు చెప్పెను. బాపయ్యగారు కృష్ణమూర్తిని జూచి హర్షముతో లోనికిఁ గొంపోయిరి. కృష్ణమూర్తి తండ్రి యప్పటి పరిస్థితిని వారితో జెప్పెను. ఆయన ఏవోమాత్రలు చేతఁబెట్టి యనుపానమును జెప్పెను. సాయంకాలము వచ్చి చూచెదనని పలికెను.

ఇంటికి వచ్చి తండ్రిచే కృష్ణమూర్తి యౌషధమును సేవింపఁజేసెను. చీకటిపడెను. అందఱును భుజించిరి.

ఆరాత్రి యుమాపతికి ఆయాసము వచ్చుచున్నట్లుండెను. కదలిన మెదలిన మాటలాడిన శ్వాసము దీర్ఘమగుచుండెను. నడుమ నడుమ కలవరించుచుండెను. కృష్ణమూర్తి తల్లిని భోజనమునకుఁ బొమ్మని పంపించెను. తాను దండ్రివద్ద గూర్చుండెను. ఉమాపతికి నిద్దుర పట్టకయుండెను. అటులని కండ్లు తెఱచుకొని లేఁడు, మూత్రమునకు వెళ్ళవలెనని చెప్పెను. తానేయొక కుండఁబట్టి క్రిందికి దింపకుండఁగఁ బని జరుగునట్లు చేసెను. పద్మినియు, రాధమ్మయు భోజనములు చేసితిమని వచ్చిరి. వెంటనే వచ్చుటచేఁ గృష్ణమూర్తి వారిని మీరు తినలేదు. తినకున్న రేపు లేవలేరు. పోయి తినుడని చెప్పెను. నానోట మెతుకుపోవుట లేదని పలుకుచు రాధమ్మ ఏడువసాగెను. కృష్ణమూర్తికిని దుఃఖమాగలేదు. పద్మిని బిగ్గరగనే యేడువసాగెను. నిదురించుచున్న శంకరముగారికిది మేలుకొనుటకు హేతువయ్యెను. అచటకువచ్చి వారి నోదార్చి భోజమునకు దీసికొనిపోయెను. ఈ శబ్దమువిని యుమాపతి కృష్ణా! ఏమది యని యడిగెను. ఏమియును లేదని యాతఁడు బదులు చెప్పెను. నిద్దురపట్టుట లేదా నాయనా? యని కృష్ణమూర్తి ప్రశ్నించెను. ఏదో మాగన్నుగనే పట్టుచున్నది. తెల్లవారుజామునకు బాగుగనే పట్టును, లెమ్మని పలికి కనులుమూసికొనెను. వంటయింటినుండి వారు వచ్చిరి. కృష్ణమూర్తి వారితో మీరీరాత్రి పరుండుడు. చాల దినములనుండి

నిద్దుర లేకయున్నారు. నేను నాయనగారివద్ద మేల్కొని యుండెదనని పలికెను. రాధమ్మ నాయనా! నేనును నీతో మేల్కొందు ననెను.

ఆ రాత్రి ఉమాపతికి నిద్దురపట్టలేదు. నాలుగైదు సారులు మంచితీర్థ మడిగెను. కనులు మూసికొనిన కలవ రింతలు. సూరయ్యయు, సుందరరావును వచ్చిరి. లోనికి రమ్మనుడనును. నేనీయదలచితిని. ఇత్తును, మీరేమియుఁ జేయ వద్దనును. ఇట్లేవేవో యనేకవిధములుగా ననుచుండెను. కృష్ణ మూర్తి ఏమది నాయనా! హృదయము పదిలపఱచుకొనుమని యొకటిరెండుసారులు చెప్పెను. నేనేమియు ననుటలేదని సమా ధానము చెప్పెను. ఎట్లో రాత్రి గడచెను. తెల్లవారుజాము నకుఁ గొంచెము కునుకుగఁ బరుండెను.

కృష్ణమూర్తికిని అప్పుడే నిద్దురపట్టెను. సరిగ నాలు గంటల కాతఁడు లేచెను. కాలకృత్యములు తీర్చుకొని స్నానము చేసెను. రాధమ్మ కూర్చుండియే కునికిపాట్లుపడు చుండెను. ఆమె కండ్లు తెఱచి చూచునప్పటికి కృష్ణమూర్తి స్నానముచేసియుండెను. ఆమెయు నాయనా! నీవిటనుండుమని యాతని తండ్రికడనుండఁజేసి లోనికేగెను. బాగుగఁ దెల్ల వారెను. సూర్యోదయుదయించెను. కొంచెము ప్రొద్దెక్కెను. కృష్ణమూర్తి తండ్రిని లేపి కాలకృత్యములు నిర్వర్తించునట్లు చేసెను. ఆయన మిగుల నీరసముగ నుండెను. మంచముమీద

లేచి కూరుచుండుట కాయనకోపిక లేకపోయెను. కృష్ణమూర్తి తండ్రి కౌషధముగూడ నిచ్చెను. భజగోవింద శ్లోకములు ఉమాపతి లోన ననుకొనుచుండెను. అవి యనుకొనుచున్నపుడు కొంత ఆయాసపడుచున్నట్లనిపించెను. కృష్ణమూర్తి యాతని నిదానించి చూచెను. తల్లి, యింటినుండి గదిలోనికి వచ్చెను. కృష్ణమూర్తి యామెను దండ్రికడ నుండుమని తాను వీధిలోని కేగెను. తిన్నగ సత్యమూర్తి యింటి కేగెను.

కృష్ణమూర్తినిఁ జూచుటతోడనే సత్యమూర్తి, కృష్ణా ఎప్పుడు వచ్చితివని చేయిపుచ్చుకొని లోనికిఁ దీసికొనిపోయెను. శాంతమ్మ బాబూ! ఎప్పుడు వచ్చితివని ప్రశ్నించెను. కృష్ణమూర్తి నిన్నవచ్చితిని. బాబయ్యా నాయనగారిస్థితిబాగుండ లేదు. ఆయన తరువాతనీవేకదామాకుపెద్ద. మాయింటికివచ్చి నాయనను జూడుము. ఆయనమనస్సున కూరట కలుగును. మాకుధైర్యముగ నుండును, బాబయ్యా! ఆయనయిట్టి స్థితిని పొందుటకు అర్హుఁడుకాడని కన్నులనీరునించెను. సత్యమూర్తి కన్నులనుండి సంతతధారగా నశ్రువులు ప్రవహింపసాగెను. కృష్ణమూర్తిని దగ్గరకుఁదీసికొనెను. మాటాడుటకు ముమ్మారు ప్రయత్నించెను. కంఠము రుద్ధమయ్యెను, ఎట్లో తెమల్చుకొని తండ్రీ! నేనుపాపిని నాకు నరకమేశరణ్యమని యనెను.

కృష్ణమూర్తిఇపుడేమియు వెనుకటివి తడవవలదు. రండు, పిన్ని, నీవును, బాబయ్యయు నింటికిరండు. నేనేగి నాయనగారి

కడనుండునని పలికెను. తండ్రీ నీవెంటనే వచ్చుచున్నాము నడువుమని సత్యమూర్తినుడివెను.

కృష్ణమూర్తి తండ్రియున్న గదిలో ప్రవేశించెను. ఉమాపతికండ్లు తెరచెను. ఎచటకేగితివని ప్రశ్నించెను. వీధిలోనికని యాతఁడు బదులుచెప్పెను. రాధమ్మబయటనుండి సత్యమూర్తి దంపతులు వచ్చుటచూచెను. పద్మినిఎదురువెళ్లెను. సత్యమూర్తి రాధమ్మనుజూచి వదినా! నమస్కారము. పాపిని మీయింటికి వచ్చుచున్నానని యాడుదానివలె వాపోయెను. రాధమ్మ! అబ్బాయీ! శాంతమ్మా! రండులోనికిరండు జరిగినదానికి విచారపడవలదని పలికెను. గదినుండి కృష్ణమూర్తి సావడిలోనికివచ్చి సత్యమూర్తిని దగ్గిరకడకుఁగొంపోయెను. తండ్రితో 'నాయనా! బాబాయియు పిన్నియు నిన్నుఁజూచుటకు వచ్చిరనెను. ఉమాపతి కండ్లుతెఱచిచూచెను. సత్యమూర్తి చేతులుజోడించెను. కనులువెంట బాష్పములు సంతత ధారగఁ గారుచుండెను. ఉమాపతి యాతని జోడించిన చేతులనుబట్టుకొనెను. చిన్నవాడవు." విచారింపకుమని యనెను. ఇంతలో భూషయ్యయు వెంకయ్యయు నటకేతెంచిరి. సత్యమూర్తి నచ్చుటచూచి చకితులైరి. ఉమాపతి సత్యమూర్తిని దన మంచముపై గూరుచుండుమని దగ్గరకు లాగుకొనెను. సత్యమూర్తి తుపానునాటి సముద్రమువలె సంక్షోభించుచుండెను. ఎట్టకేలకు కంఠము పెకలించుకొనెను, అన్నయ్యా! నాదోషములను క్షమిం

పుము. కనులు కప్పి నీయెడ నపరాధము గావించితిని. నాకు దెలియును. నాదోషమునకు ప్రాయశ్చిత్తములేదని; ఉండ రాదు కూడను. నీవు మనుజులలో దేవతవు. ధన్యజీవివి. నేను మనుజులలో రాక్షసుఁడను. నీయీస్థితికి కారణము నేను. ఇట్టి పాపపుఁబని చేసిన నేను లోపలఁగుళ్ళుచున్నాను. నిన్నుక్షమా భిక్ష వేడి నీదర్శనము చేసినఁగాని నాపరితాపము చల్లారునట్లు దోఁచలేదు. అబ్బబ్బ! ఎన్నిచేసితిని. సుందరరావుగారి కెన్ని చెప్పితిని. సూరయ్యకెన్ని సలహాల నొసంగితిని. నీవు పిలిపించి నపుడు ఎంత నమ్మకముగ మాటాడితిని! అన్నయ్యా మీ కుటుంబము నీస్థితికిఁ దెచ్చినది నేను, నన్ను క్షమింపుము. అని పిచ్చివానివలె ఎలుగెత్తి యఱచెను. ఉమాపతి సత్యమూర్తి చేయితన చేతనుంచుకొనెను. 'తమ్ముడూ! మానవులల్పులు. అల్పత్వము కన్పఱచుటయే మానవత్వము. నీవేమి చేయు దువు? కాలమునకు అందఱును లొంగవలసినదే. నీదియును సూరయ్యగారిదియును, గాదు. ఇందు నాదోషముగూడ నున్నది. లేనిచో మీ రేమిచేసెడివారు? అదియునుగాదు, ఇంతటితో మాకును ఈ యాస్తికిని సంబంధ ముండగూడదని భగవంతునియాజ్ఞ. మనుష్యుడు తాను జేయుచుంటినని యహం భావము నొందును. అదియంతయు భ్రమ. ఒకయాకైనను నాతని యాదేశము లేనిదే కదల వెఱచును. నేను మాటాడ లేను. భూషయ్యమామా! వెంకయ్యతాతా! వచ్చితిరా! మా

కుటుంబమును గనిపెట్టియుండుడు. అని కొంచెము దుఃఖపరీతుఁడయ్యెను. (కొంచెమాగి) మా నాయన కృష్ణమూర్తి పసివాడు. మీదే భారమనెను. ఆ యిరువురును గన్నుల నీరు నించిరి. నోటినుండి మాట వెలువడలేదు. మరల ఉమాపతి తాతా! మా తమ్మునకు నే నిచ్చిన ఇరువది ఎకరములును దస్తావేజు వ్రాయలేదు. సూరయ్య వానిని జప్తులో చేర్చలేదు. నాయనా! కృష్ణా! బాబాయి కిరువది ఎకరములును వ్రాయించి యిచ్చుభారము నీది. ఇది నామాటసుమా! అనెను, సత్యమూర్తి బిట్టుగ గదలిపోయెను. ఊరిలోని పెద్దలందఱును వచ్చిరి. అందఱీమాటలను వినుచుండిరి. ఏమనువారు లేరు. భూషయ్యగారచటనున్న వారందఱను వెడలిపొండని చెప్పెను. గాలి తగులునట్లుగ జన మద్దులేకుండఁగఁ జేసిరి. భూషయ్యయు వెంకయ్యయు నుమాపతినిజూచి నమస్కరించుచుఁ గనులనీరు నింపి సెలవనిరి. ఉమాపతి వారిపైఁ దృష్టి బఱపి శుభమని పలికెను. ఎల్లరును వెడలిపోయిరి. శాంతమ్మ లోనికేగి వంట ప్రయత్నముచేసెను. ఒక్కరొక్కరే బలవంతముమీద భోజనములు చేసిరి.

మధ్యాహ్నమునుండియు నుమాపతికి ఆయాస మెక్కువయ్యెను. మందుగాని, బత్తాయిరసముగాని త్రాగిన నెక్కువగ బాధపడుచుండెను. కృష్ణమూర్తి వెళ్లి బాపయ్యగారిని

దీసికొనివచ్చెను. ఆయన నాడి చాల నీరసముగనున్నదని పలికి మందిచ్చి వెడలిపోయెను.

సాయంకాలమయ్యెను. పిలిచినను ఉమాపతి పలుకుట కష్టముగ నుండెను. సత్యమూర్తియు కృష్ణమూర్తియు మంచమును గనిపెట్టుకొనియుండిరి.

చీకటిపడెను. మందు త్రాగలేదు. కృష్ణమూర్తి నాగయ్యను బాపయ్యగారికై పంపెను. ఆయనవచ్చి చూచెను. ఈ రాత్రి గడచుట కష్టమనెను.

ఎట్లో ఆరాత్రి గడచెను, సూర్యుఁడుదయించెను. పది మారులు పిలిచిన నొకసారి యుమాపతి చూచుచుండెను.

మదరాసునుండి మోహనుఁడును పున్నమ్మగారును మెయిలుపై నూజివీడుస్టేషనులో దిగివచ్చిరి. ఊరిచివరనే వారికీసంగతి తెలిసెను. బండి దిగినతోడనే సరిగ గదిలోని కేగిరి. పున్నమ్మగారు నెత్తిబాదుకొనుచుఁ గుమారుని బిలిచెను. కృష్ణమూర్తిబావ వచ్చెనని బిగ్గరగ నాతని చెవిలోన నఱచెను. ఉమాపతి ఒకసారి తల్లివైపును వేఱొకసారి మోహనునివైపును జూచెను. తిరిగి కండ్లుమూసెను. ఇరువది రెండేండ్ల క్రింద నూపిరితీసిన యుమాపతి కడసారిగ నూపిరి విడిచెను. ఇల్లంతయు నొక్కసారిగ గ్రామమంతయు నొక్కపరి విలపించెను.

---